(గీత మాధవము)

# ఆంధ్ర గీతగోవిందము



తిరుమల తిరుపతి దేవస్థానము వారి
ఆర్థిక సహాయముతో ముద్రింపబడినది.

## యతిశ్రీ

శ్రీమాన్ యల్లకరి తిరువేంగళసూరి
సూరి సమ్రాట్.

ఆంధ్ర గీతగోవిందము - యతిశ్రీ

ప్రథమ ముద్రణ : డిసెంబరు 1996

ప్రతులు : 1000



వెల : రూ. 75-00

ముఖచిత్రం : తన్నవెళ్ళి శ్రీనివాసులు - మార్కాపురం

ప్రతులకు :

విశాలాంధ్ర బుక్ హౌస్

హైదరాబాదు - విశాఖ - విజయవాడ - గుంటూరు

కాకినాడ - అనంతపురం - తిరుపతి - హనుమకొండ

వై. తిరువేంగళసూరి

గుంటి ఆంజనేయస్వామి బజారు

వినుకొండ (Po.)

గుంటూరు జిల్లా.

ముద్రణ :

శ్రీ సాయిరాం ప్రింటర్స్

మార్కాపురం - ప్రకాశం జిల్లా,



డా॥ పుల్లాపంతుల రాధాకృష్ణమూర్తి
కవితా సుధాకర - అష్టావధాని
శ్రీ పెద్దన కళాపీఠాధ్యక్షులు
త్రిపురాంతకము.

# ప్రవేశిక

శ్రీ రాధాకృష్ణ విలాస భాసురమైన శ్రీ గీత గోవిందమను సంస్కృత కావ్యమును శ్రీమాన్ యల్లకరి తిరువేంగళసూరిగారు ఆంధ్రీకరించినారు. అష్టపదులను నామాంతరముగల గీతగోవిందమందలి గీతముల విననివారుండరు. అభిరుచిగల చలనచిత్రనిర్మాతలు కూడ వీనిని తమ చిత్రముల ప్రవేశపెట్టి బహుళప్రాచుర్య దోహదులైనారు. చక్కని లయనిర్దేశముగల యీ గీతములను విని యానందించని వారెవరు ?

స్పష్టమైన ఛందస్సంకలనము గలిగియుండుట యీ అష్టపదులలోని విశిష్టత. ఏ కొద్దిపాటి సంస్కృతజ్ఞానమున్న శ్రోతనైనను ఆనందింపజేయగల ద్రాక్షాపాకసాహిత్యమిది. ఇట్టికృతి నాంధ్రీకృతమొనర్చిన శ్రీ తిరువేంగళ సూరిగారు ధన్యులు. వీరి యాంధ్రీకరణము స్పృశించుటకు ముందు మూలగ్రంథమును కొంత యావచ్ఛక్తిగా స్మరించుట యుక్తము.

## సంస్కృత గీత గోవిందము - జయదేవ మహాకవి.

సంగీత సాహిత్య మాధురీ మహిమాత్మకమైన 'గీత గోవిందము' జయదేవ మహాకవిచే రచింపబడిన విశిష్ట సృష్టి; శ్రీకృష్ణుడు - రాధ వీరిద్దరి శృంగార ప్రపంచము. జయదేవకవి క్రీ. శ. 11వ శతాబ్ది చివర భాగమున వంగదేశమును పరిపాలించిన లక్ష్మణసేన మహారాజు నాస్థానమున ప్రసిద్ధుడు.

# II

శరణకవి, ధోయీకవి, గోవర్ధనాచార్యుడు, ఉమాపతిధరుడు మున్నగు ప్రసిద్ధ సంస్కృత కవిపండితుల సమకాలికుడు. జయదేవకవి జగన్నాధ ప్రాంత మందలి బిందుబిల్వ మను గ్రామ నివాసి. భోజదేవుడు రామాంబయను దంపతులకు బుట్టిన బ్రాహ్మణోత్తముడు. ఇతని భార్య పద్మావతి. ఇతడు చంద్రాలోకము, రతిమంజరి, కారకవాదము, తత్వచింతామణి మున్నగు గ్రంథములను రచించెను. జయదేవుని రచనలందు గీతగోవిందము హృదయంగమము. కవియొక్క తాదాత్మ్యత యిందు గలదు. గీత గోవిందము రచించుట కీ క్రింద తెల్పబోవు కవియొక్క జీవితసంఘటన కారణమని కింవదంతి. అందులకే ఇంతటి జీవకళ యీకావ్యమునకు గలదని ప్రతీతి. అదేమన ?

లక్ష్మణసేన మహారాజునకు జయదేవ మహాకవికి మంచిస్నేహ ముండెడిదట. అట్లే రాజుగారి భార్యకు కవిగారి భార్య పద్మావతీదేవికి మంచి స్నేహము, వీరిద్దరు ముచ్చటించునప్పుడు పాతివ్రత్యాదిక ప్రస్తావనలలో రాణితో పద్మావతి "భర్త మరణించిన భార్య యింకను జీవించునా"? యను భావముదోప మాట్లాడినదట. ఇది యిట్లుండ, ఒకనాడు రాజుగారు జయదేవకవితో కలసి వేటకు వెళ్ళిరి. తడవైనను రాకుండుటచేత, పద్మావతి కారణము తెలియుటకై రాణిగారి వద్దకు దాసినంపగా "నీపతి యడవిలో మరణించె" నని రాణి వార్తనంపినది. అది వినినంత పద్మావతి మూర్ఛనంది మృతప్రాయమైన నిశ్చేష్టత నందినది. తరువాత వచ్చిన రాజునకు కవిగారికిని యీవిషయము తెలిసినది. అందరు నాందోళన పడిరి. జయదేవుడు భార్యకళేబరము కడ తాను శుచియై కూర్చుండి శ్రీకృష్ణు నావేశింప జేసికొని గీతగోవిందమును నుడివెను. పదియవ సర్గము ముగియునప్పటికి పద్మావతి చైతన్యవతి యయ్యెను. అప్పటివరకు విప్రలంబ శృంగారమున నడచిన గీతగోవింద కావ్యము ఆగినది. పద్మావతి బ్రతికిన సంతోషమున జయదేవుడు తనకావ్యమున సంభోగశృంగారము వర్ణించి, మరి రెండుసర్గలతో ముగించెను. ఈ సంఘటనతో రాజదంపతులతోసహా అందరును సంతసించిరి. ఇదెంతవరకు నిజమైనను, కావ్యవిశిష్టత మాత్రము అనితరదృష్టము,

జయదేవుడు గీతగోవిందకావ్యమును రచియించిన కాలముననే సాత్యకి యను రాజుగారును రాధాకృష్ణ లీలలను శ్లోక రూపమున రచించెనట.

రాచరికపు గర్వమున జయదేవకవి కృతికన్న తనకావ్యము మిన్నయని పలికెనట. పండితులు రెండుకావ్యములను జగన్నాధుని సమీపమున నుంచగా జయదేవుని కృతినే జగన్నాధుడు స్వీకరించెనట. అట్టి లోకోత్తరకావ్యము గీతగోవిందము. రాజుగారియెడ గల ఆదరగౌరవములచే జయదేవుడు తన కావ్యమున రాజకృత శ్లోకములను సమయోచితముగ జేర్చెనట.

గీతగోవిందము రచించుచో జయదేవుడు పొందిన పారవశ్యమపారము. పందొమ్మిదవ అష్టపదిని రచించునప్పుడు జయదేవుడు;- "స్మరగరళ ఖండనం మమశిరసి మండనం" అని వ్రాసి ఆవెంటనే తనకు స్ఫురించిన "ధేహి పదపల్లవ ముదారం" అని వ్రాయుటకు సంశయించెనట. శ్రీకృష్ణుడు రాధయొక్క పాదమును శిరోభూషణముగా అనుట యుక్తమా అని జయదేవుని సందియము. ఆపంక్తిని అసంపూర్ణముగనే వదలి జయదేవుడు స్నానమునకై యమునకేగి వచ్చునరికి తాను వ్రాయ సంశయించిన చరణమే గీతమున వ్రాయబడియుండుట జూచి యాశ్చర్యము నొందిన కవీంద్రుడు భార్యనడుగగ ఇప్పుడు మీరే వ్రాసి వెళ్ళితిరిగద అని చెప్పెనట. అది విన్న జయదేవుని యానందమునకు మేరయుండదు గదా! తన రూపములో కృష్ణుడే వచ్చి వ్రాసినాడని యెంత దివ్యానుభూతి నందినాడో? ఇదియే జీవనాష్టపదిగా ప్రసిద్ధి గాంచినది. ఈ అష్టపదియందు పైచరణమును శ్రీకృష్ణ విరచితముగా భావించుచూ జయదేవకవి అధికముగా మరియొక చరణము రచించెనట. అందువే నీ పందొమ్మిదవ యష్టపదిలో అష్టపదియను నియమమును మించి యొక చరణముండును. అట్లే దశావతార వర్ణనాత్మకమగు ప్రథమాష్టపది యందు, అవతార సంఖ్యనుబట్టి చరణము లున్నవి. మిగిలినవన్నియు అష్టపదులే.

ఇట్టి చిత్రకథలీ కావ్యమును గురించి, కవిని గురించియు కలవు. భాగవతోత్తముడైన జయదేవుని జీవితమునందిట్టి దివ్యఘట్టము లనేకములు గలవు. సంస్కృత వాఙ్మయమున గానయోగ్యములైన కావ్యములలో ప్రసిద్ధములు, "తరంగము" లనబడు నారాయణ యతీంద్రుల "శ్రీకృష్ణ లీలాతరంగిణి" మరియు జయదేవ కవీంద్రుల "గీత గోవింద కావ్యము" అనబడు ఈ అష్టపదులు. బహుళప్రాచుర్యముగల ఈ కావ్యము

లందు, మాధుర్యము చిప్పిల్లు అష్టపదులు సంగీతసాహిత్య విద్వన్మణుల కత్యంత ప్రీతిపాత్రమై యొప్పినవి.

గీత మాధవము – గీతీ నాటకము – గోపికానృత్య గీతిమని ప్రాచుర్య మందిన ఈకావ్యము ననుసరించి. భానుదత్తుడు "గీతగౌరీపతి" – కళ్యాణకవి "గీత గంగాధరము" – రామరంజితకవి 'గీత గౌరీశము' – మైథిలీకృష్ణదత్తు 'గీతగోపీపతి', అను కావ్యములు రచించిరనగా నీకావ్యప్రభావ మెట్టిదో మనమూహింపవచ్చును గద !

ప్రఖ్యాత వక్త ఆర్నాల్డు గీతగోవిందకావ్యాన్ని Song of Songs గా వర్ణించి కీర్తించాడట. విలియం జోన్సు అనేకవి ఈకావ్యాన్ని ఆంగ్లము లోని కనువదించాడట. జార్జి వేథ్ అనే మహానుభావుడు గీత గోవిందాన్ని (Prose) గద్యంగా అనువదించి సమయోచితంగా అనేక చిత్రాలను చిత్రించాడట. పరభాషా పండితులనుకూడ నింతగా నాకర్షించిన గీతగోవింద కావ్యాన్ని తెలుగులోను అనువదించారు క్రీ. శ. 1684 సం॥ ప్రాంతము వాడగు శ్రీనివాసకవియు, 'విద్యాభూషణ' సూరాబత్తుల సూర్యనారాయణ కవి ఉయ్యూరు జమిందారు శ్రీ వేంకటాద్రి అప్పారాయులుంగారు మొదలగు వారలనేకులున్నారు. శ్రీ చల్లా పిచ్చయ్యగారు గీతగోవిందము నాంధ్రీక రించి గానము చేసి'అభినవ జయదేవులు' గా ప్రసిద్ధిగాంచిరి. ఈకావ్యమునకు యేబదియైదు (55) కు పైగా సంస్కృతవ్యాఖ్య లున్నవి. శ్రీ ఉత్పల వేంకట నరసింహాచార్యులు తెలుగునందును వ్యాఖ్యలను వెలయించిరి. సాహితీ తరంగము నందిట్లుండ ఆధ్యాత్మికమునకు గీతగోవింద కావ్యమునకు విశిష్టత యున్నది. ఆలంకారికులు పెక్కుచోట్ల నీకావ్యలక్షణము లుదహరించుటేకాక, ఆధ్యాత్మికోపన్యాసకులును పలు చోట్ల నీకావ్యమునగల దివ్యానుభూతి నుటంకింతురు. నేటికిని ఒరిస్సాలో 'భాగవతఘర్' అనుపేరున నున్న అనేక రాధాకృష్ణ మందిరములలో భక్తులీయష్టపదులను భక్తిపారవశ్యమున గానము జేయుచు నాట్యము లాడెదరట.

గీతగోవిందమునకును భాగవతమునకును పోలిక యున్నది. "కామో త్కంఠత గోపికల్, భయమునం గంసుండు" అనిగదా పోతన్న భాగవతోక్తి;

అంతయేల ఇటీవలి శ్రీసుందరచైతన్యులవారి ఆధ్యాత్మికోపన్యాసములందేమి, వారి గ్రంథములయందేమి గీతగోవింద చరణము లుదాహృతములే. సారస్వతాధ్యాత్మిక ప్రాధాన్యతమించి సంగీత ప్రాధాన్యత గీతగోవిందమునకే తగియున్నది. అష్టపదులెఱుగని గాయకుడు బహుశా ఉండడు. అందులకా గీతములందుగల శబలతయే కారణము.

ఇట్టి విలక్షణ కావ్యమును తలమునుకలుగ పఠించినను తనివి తీఱదు. తీఱికి యేదో చేయవలయునని తీవరమేర్పడును. సంగీతసాహిత్యపాటవమున్నవారిలో ఈ యుత్సుకత హెచ్చు. అట్టివారి కోవలో చేరినవారే ఈ ఆంధ్ర గీతగోవిందమును రచించిన శ్రీమాన్ యల్లకరి తిరువేంగళసూరిగారు.

## ఆంధ్రీకరణము – కవి.

కావ్యము రచించుట ఋషి కృత్యము. ఆపని కవి చేయును. కావ్యము రచింపబడిన భాషలోనే వ్యాఖ్యానాదుల రచించుట రసాస్వాదకులైన పండితుల పని. కానీ భాషాంతరీకరణ మనగా కవియు పండితుడునునై ఒక భాషలోని భావాదులను మరియొక భాషలో వివరించు కవిపండితవర్యుని పని. అందునను మాత్రాఛందమున యథామాతృకముగ గేయమును భాషాంతరీకరణ మొనర్చుట కత్తిమీదసాము – అట్టి కవిపండిత కృత్యమును శ్రీ సూరిగారు సమర్థవంతముగ నిర్వహించిరనుట నిర్వివాదాంశము –

అందులకు కారణములు చాలా గలవు. మొదటిది అభిలాష. శ్రీ సూరిగారు కవులు గాయకులు. పెక్కురచనలు చేసియు, పలు రంగస్థలముల యందును కచేరీలయందు గానమొనర్చినారు. పౌరాణిక నాటకాదులను నేర్పించియున్నారు. ఆవిధముగ రసజ్ఞులకు సుపరిచితులైనవారు. గీతగోవిందమందలి రసాస్వాదనము వీరు పలువురితో పంచుకోగల కోరికయే యీ ఆంధ్రీకరణమునకు ప్రథమము ప్రధానమైన ప్రేరణ.

మరియొక్క కారణము వీరి కుటుంబము పండిత వంశానుగతము. వీరి స్వగ్రామము ప్రకాశం జిల్లా కొమరోలు మండలం గోపానుపల్లె. తండ్రిగారు

చిన్నతనముననే గతించినందున ప్రకాశం జిల్లా త్రిపురాంతకం మండలం ఒడ్డుపాలెం గ్రామంలో మేనమామగారు శ్రీ వరయూరి వేంకటనర్సయ్యగారి వద్ద పెరిగారు. ప్రస్తుతం అక్కడే నివసిస్తున్నారు. వీరి తాతగారలు యల్లకరి కృష్ణమాచార్యులు దేవ్యుపాసకులు. ప్రకాశం జిల్లా తురిమెళ్ళ వద్ద శ్రీ సురభేశ్వరమ్మ కోనలో తపస్సు చేయగా అమ్మవారు సాక్షాత్కరించినట్లు, కొన్ని మహత్తులు చూపినట్లు పూర్వీకులనుకునేవాళ్ళు; తండ్రిగారు కేశవా చార్యులు గొప్ప సంగీత విద్వాంసులు, సాహితీవేత్తలు మంచి హరికథకులు; వారివల్ల సంక్రమించినదైతేనేమి, బ్ర. శ్రీ బందా కనకలింగేశ్వరరావు, బ్ర. శ్రీ ఉప్పల వేంకటశాస్త్రి, బ్ర. శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి, నవయుగ కవిచక్రవర్తి శ్రీ గుఱ్ఱం జాషువా సాహచర్యాలవలన నైతేనేమి శ్రీ సూరిగారికి సంగీత సాహిత్యాలు కరతలామలకాలైనాయి. శ్రీ పాపయ్య శాస్త్రిగారు సూరిసమ్రాట్‌గా అభినందించారు. శ్రీ సూరిగారు, "యోసోపు చరిత్రము" అనే నాటకము. 'కర్ణ' ఏకపాత్ర 'భట్టుమూర్తి' యథార్థ రసికజన మనోభి రామము, రచించుటతోబాటు అనేక ప్రాసంగిక కవనాలతో సుప్రసిద్ధులు. ఇలాంటివారు సంగీతసాహిత్య సమప్రాధాన్యమైన గీతగోవిందాన్నాంధ్రీక రించడము ముదావహమైన విషయము.

## ఆంధ్రీకరణము – అభినందనీయాలు

శ్రీ సూరిగారి ఆంధ్రీకరణలో మూలాన్ని సొగసుగా ననుకరించిన తీరులున్నాయి. మెఱుగులు దిద్దిన ఆనందనీయాలూ ఉన్నాయి. స్థాలీపులాక న్యాయంగా పరికిద్దాము. నాందీపద్యము కవిగారి హృద్యమైన యనుభూతి. సముద్రపు టంచులను చుంబించు ఆకాశదృశ్యము. అది రాధామాధవ రసమయ లీలాస్ఫోరకమై కవిగారికి కన్పించి యాపద్యముగ స్ఫురించినది. వారీదృశ్యమును మదరాసుమెరీనాబీచ్‌లో తిలకించి పులకించిరట. గోలోకాధీశ్వరి యైన రాధ, ప్రణయగాధకు నాంది యగుటచే 'ల' కారప్రాసము ప్రయుక్త మైనది. అనుభవైకవేద్యమైన యీ సుందర దృశ్యాలోకమును మృదులరీతిని ఛందోలోకమున అందమగు ఉత్పలమాలికలో రచించినారు. రసమయమైన సముద్రమును రాధాదేవిగను. సర్వవ్యాపకమైన వినీలాకాశమును శ్రీకృష్ణునిగ వర్ణించుట అత్యంత మనోహరముగ నున్నది గదా!

మాతృక యందలి తొలిశ్లోకము ననువదించునెడల "గృహస్థుని జేయుము" అనుదానికి గృహమునకు జేర్చుమనియు, నొకయింటివానిగా జేయుము అను శ్లేష యున్నది. అట్లే "అన్నసందాలపనంబులన్" అను దానిలో అన్న = 1) అన్నయైన 2) అని పలికిన; సందాలపనంబులు = 1) నందుని మాటలు 2) సంతోషకరములగు మాటలు అను శ్లేషార్థములు స్ఫురించును –

గీతగోవింద కర్తయగు జయదేవ కవినామమునకు 'యతి' అను పూజనీయ సంబుద్ధిని నిల్పి అందులో తన నామధేయమును, [యల్లకరి - తిరువేంగళసూరి] సంక్షిప్తముగ స్ఫురింపజేసిన తీరు చక్కని ఆతుకులేని చతురతను జూపుచున్నది. ఈ విషయమును 3వ పద్యంలోని "జయదేవ యతిచే" అనునదియు 4వపద్యంలోని "జయదేవ యత్యుక్త" అనునదియును; ప్రతి అష్టపది చివరన "యతి జయదేవ కృతము" అనునదియును, తెలియ జేయుటయేగాక, నామాంకితమును నిలిపినట్లుగ దోపింపజేయుచున్నది.

కవిగారు శ్లేషపై మక్కువ జూపినారు. 5వ అష్టపది 6వ చరణములో కడపల నిలబడి అనగా 1) కృష్ణస్వామి రాధకొఱకు కదంబ వృక్షములలో నిలబడి యనియు 2) ప్రతియింటి గడపయందును నిలుచుండి అను అర్థములు దోచును. రవరవ వలపులు అనగా 1) చిరుచిరు లేతవలపులనియు 2) రవలు = రవ్వలు = రత్నాలు = రత్నములలాంటి అమూల్యములైన వలపులనియు తోచుచున్నది.

14వ అష్టపది 3వ చరణములో "అహరి మోవుల గ్రోలగ" ననుటలో శ్రీకృష్ణుడు గోపికల పెదవులననియు, గోపిక, శ్రీకృష్ణుని పెదవుల ననియు అర్థములు స్ఫురించును. మూలమున "తదధరపానం" అనియే యున్నది.

8వ అష్టపదిలోని 1వ చరణంలో జయదేవకవి ఒక్క మలయ మారుతమునే విషమని వర్ణించాడు; కాని సూరిగారు, గంధమును, జాబిల్లిని, మారుతమును విషసంబంధులుగా నుడివి మిక్కిలిశోభను చేకూర్చినారు.

27వ పద్యంలో "ప్రియసఖీ మాలాపి జాలాయతే" అనే మూలాన్ని హల్లీసకక్రీడగా వర్ణించి మూలమునకు కవిగారు సొగసు జేకూర్చారు.

15వ అష్టపదిలో, 3వ చరణములో నెలవంకలనగా 1) బాలచంద్రులు, 2) నఖక్షతములనియు. ఘనమౌ అనగా 1) విరివియగు 2) దిటవగుననియు అను శ్లేషలు స్ఫురింపజేశారు. 17వ అష్టపది పల్లవిలో 'పోరా కృష్ణా! పోరా మాధవ!' అనుచో పోరా = 1) వెడలుమురా 2) వెళ్ళినా మరల రావలయుననియు; కృష్ణా! = 1) కన్నయ్యా అనియు 2) ఇనుమువలె కఠినుడా యనియు 3) మాలిన్యుడా యనియు, మాధవా = 1) శ్రీనాథా యనియు 2) మాకు భలేమగనివే [అని ఎత్తిపొడుపుమాట] యనియు శ్లేషలు ప్రస్ఫుటముగా గోచరించును.

అట్లే 54వ పద్యమున నిశ్శంకన్ అను పదమునకు 1) నిర్భయముగ 2) నిర్విచారముగ 3) నిస్సందేహముగా ననియు నర్థములు గలుగుచున్నవి. 48వ పద్యంతో "బాధాం విధేహి మలయానిల" అని మూలములో నున్నది. రాధ విరహమున కోర్వజాలక మలయమారుతాదులను నిందాగర్భముగ ప్రాణములను దీయుమని ప్రార్థించుచున్నది. కాని సూరిగారు 'భంజింపరార ప్రభంజనుండ' అని ప్రభంజనశబ్దమునకు సార్థకతను జేకూర్చారు.

66వ పద్యంలో 'కర' అను పదమునకు 1) కపటము 2) చేయి అను అర్థములు గల్గునట్లు చెప్పుట సమంజసముగా నున్నది.

70వ పద్యంలో 'కాకృత్యమయ్యెన్' అను పదమునకు, రాధ పురుషాయితమును సల్పి మన్మథ యుద్ధమున శ్రీకృష్ణుని జయింపవలెనని ప్రయత్నించగా ఒడలు కంపించెను, వక్షమదరెను. బాహులతలు వ్రాలి పోయెను. తద్విధముగా విఫలమై అయ్యది స్త్రీలకు చేయరాని పనియని పశ్చాత్తాపపడెను. కాకృత్యము — 1) అకార్యము 2) పశ్చాత్తాపము అను అర్థములు గోచరించును — మరియు అబలులు సబలలని పురోగమించే యీరోజులలో సూరిగారు భామల్ దుర్బలులని నొక్కిచెప్పక, భామల్ దుర్బలులేమొ అని సందేహాస్పదముగా నుడువుట సమంజసముగా నున్నది,

24వ అష్టపది పల్లవి కవిగారు చెప్పినట్లును తక్కిన చరణములన్నియు రాధ పలికినట్లును మూలంలోనుండగా శ్రీ సూరిగారు తాను స్వయముగా పాడి తృప్తిజెందక పల్లవికూడ రాధ పలికినట్లుగా మార్పుజేసి గానయోగ్యముగా

నొనర్చినారు. మరియును అందులో 7వ చరణములో 'శుభాశయ' అను పదమునకు 'శ్రీకర' పదమును నిలిపి 1) శుభములు చేయువాడు 2) మనోహరమగు ప్రశస్త హస్తము గలవాడనియు, పరిచయపదమును వాడి మూలమునకన్న అందమును చేకూర్చారు.

72వ పద్యమును చక్కనితెలుగులో సొంతముగా సాగించి, కావ్యాంతమున జయదేవుడు వ్రాసిన 'యద్గాంధర్వ కలాసు' అను శ్లోకాన్ని సూరిగారు చక్కని తెలుగుపద్య పోకడలో చెప్పారు చూడండి హాయిగా –

ఎయ్యది విష్ణుచింతనము ? నెయ్యది గానకళా సుకౌశలం ?
బెయ్యది యుజ్జ్వల ప్రథిత ? మెయ్యది యాక్షితి మోక్షసాధకం ?
బయ్యది పండితాలి కొనియాడ రచించిరి సంస్కృతంబునన్
తియ్య తెనుంగునందు జయదేవకవీంద్ర యతీంద్రు లిర్వురున్॥

"శృంగార రుచిరుజ్జ్వలొ" అనురీతి ఉజ్జ్వలతసమైన శృంగారాంగియగు గీతగోవింద కావ్యమును నాంధ్రీకరించుటయందు తనకుగల సాఫల్యతను శ్రీ సూరిగారు మనసారా చేకూర్చుకున్నారు. మరియును మూలములో లేని మోక్షప్రదమని పలికి అధ్యాత్మికభావమును గల్గింపజేశారు.

జయదేవ కవీంద్రుడు తన కవిత్వాన్ని గుఱించి యిలా చెప్పుకున్నాడు. ఓ పూదేనియా ! నా కవిత్వంతో సరిపోలుదామని చింతిస్తున్నావేమో ! వద్దు. శర్కరా ! నీలో మధురిమ కలదు, నీవు కర్కశమవు– ద్రాక్షా ! నీమొగ మెవరు చూతురె ? అమృతమా ! నీవు మృతమైతివి. అలభ్యవు, క్షీరమా ! నీవు లభించినా నీలో రసం నీరమేగదా ! ఓ తియ్యమామిడీ ! నీవు అక్రందించవలసినదే ఎందుకనగా నాకవిత మధురిమతోబాటు శుభాన్ని చేకూర్చే చతుర వాక్కులు. ఇదీ జయదేవ కవియొక్క కవితోత్కర్ష.

ఈభావాన్ని శ్రీ సూరిగారు తియ్యందనాలతో నుయ్యాలలూగే సీస పద్యంలో వివరించారు. కాంతాధరానికి కమ్రగుణం; మేటిదనం ఆపాదించటంతో జ య దే వు ని లో అంతర్గతంగా మిగిలిపోయిన అర్థాలన్ని ప్రస్ఫుటంగా సాక్షాత్కరిస్తాయి. ఓ పూదేనియా ! నీలో మాధుర్యం వున్నా

నీలో స్వచ్ఛత ధవళత లేదు. శర్కరా! నీలో మాధుర్యం ధవళతా వున్న కర్కశత్వం వుంది – ఓ ద్రాక్షా! నీలో మాధుర్యమున్నా నీకు నలుపురంగు కలదు. ఓ అమృతమా! నీలో లోపాలు లేకున్నా నీవు అలభ్యమవు; ఓ క్షీరమా! నీలో మాధుర్యం స్వచ్ఛత యున్నా నీరసం నీరమే – ఓ తియ్య మామిడీ! నేను గొప్పయని నీవు ఆక్రందించవలసినదే – అను అర్థములు గోచరించుటయేగాక; ఓ ఇప్ప పూదేనియా నీలో మదపువాసన కలదు; శర్కరలో కర్కశత్వము, ద్రాక్షలో నల్లదనము, అమృతములో మృతత్వం పాలు ద్రవపదార్థముగా నుండుటయు మామిడిపండు ఏడ్చుటయు మొదలగు లోపాలు గలవనియు, 'క్రమ' పదము విశేషముగా వాడుటవలన తెలియు చున్నది. కాంతాధరములో అట్టిలోపములు లేవు – 1) మదపువాసన లేదు. 2) కర్కశత్వము లేదు. 3) నల్లదనము లేదు. 4) మృతత్వము లేదు. 5) ద్రవపదార్థము ఘనపదార్థముగా నుండుట 6) ఆక్రందించక చిరునవ్వు గల్గియుండుట. అలాంటి విశిష్టలక్షణములున్నా ఓ అధరమా! జయదేవ యతిసూరుల వాక్కులకు నీవు సాటిరావు. ఏలననగా, శృంగారరసముతో కూడినవేగాక, మాధుర్యము కోమలములుమాత్రమే గాక, అమరములైనవి, దేవతాసంబంధములు గాన అనేక మంగళదాయకములనియు చేర్చి మిక్కిలి శోభను గల్గింపజేశారు –

చివరగా మంగళాంతముగా సమాసఘటితమైన, మనోహర సుకుమార భావముగల్గిన మత్తేభ పద్యములో (78) శ్రీకృష్ణపరమాత్మ భక్తాదులకు మోక్షమును ప్రసాదించుగాక అని ఆకాంక్షించుచూ శ్లేషలో మధురక్షోహర శబ్దమువలన 1) మధురాక్షసుని సంహరించినవాడనుటయే గాక, (కల్లు) సారా రక్కసిని నుక్కడించినవాడనియు, అక్షరంబొసగుతన్ అను పదములో 1) మోక్షము నొసగుగాక యనియు 2) అక్షరజ్ఞానము గలుగవలయుననియు అర్థములు స్ఫురించుచున్నవి. అనగా సారా నిషేధము పూర్తిగా అమలు జరుగవలయుననియు, అక్షరజ్యోతి వెలుగవలయుననియు సామాజిక స్పృహ వెలయించిన తీరు ఎంత హృదయంగమముగా నున్నదో ఆ పద్యమును ఆలోకించండి –

మ॥ మధుమాసాభిధగా, మనోరమగ, సం-భాసిల్లు రాధావధూ
పృధువక్షస్థల శుభ్రహార విలస-ద్వేణీ చలద్వాల ప
ద్మధశోరోజములన్ స్పృశించెడు పరంధాముండు శ్రీనాథుడా
మధురక్షోహరు డక్షరంబొసగుతన్-క్ష్మా భర్త భక్తాళికిన్॥

ఇలాంటి సత్కృతి నాంధ్రీకరించిన సూరిగారు సుకృతి కృతార్థి - వీరు కావ్యమునకు చక్కని వచన తాత్పర్య వివరణాదులను రచించిరి. ఇది మిక్కిలి యుపయుక్తముగ నున్నదనుటలో సందేహము లేదు.

కవిగారు స్వయముగా గాయకులగుటచే ఆంధ్రీకరించు నవసరమున సంగీతపరముగా గానయోగ్యమగుట కెట్లుండవలయునో యోచించిరి. మాత్రా చందమును జారనీయలేదు. మీరనీయలేదు, ఛందో వ్యాకరణాదులను గీటు దాటలేదు. సంగీత సమయములను ఏమారలేదు. మూలమును పోనీయలేదు. రసభంగము రానీయలేదు. మార్దవము చెడనీయలేదు. హార్దికము విడనీయలేదు. ఈ లక్షణములు శ్రీ సూరిగారి కవితలో సర్వత్ర గోచరించుచునే యుండుట చదువరులు గమనించగలరు.

సూరిగారు గీతా గోవిందము నాంధ్రీకరించుటతో తృప్తి నందలేదు. తామల్లిన గీతములకు స్వయముగ స్వరకల్పనజేసి పాడినారు. అనేకురు గాయనీగాయకులచే పాడించినారు. విని యానందించినారు. సంస్కృతమున జగన్నాథ పండితరాయలు, కాళిదాస మహాకవీంద్రుల కోవకు జెందిన జయదేవ కవీంద్రులు రచించిన గీతగోవిందము నాంధ్రీకరించుట ఒకయెత్తు - ఆ గీతముల నాలపించుట ఒక ఎత్తు. కవి పండిత గాయకులైన వీరి కృషి అనుపమానము.

శృంగార తాదాత్మ్యమున ఆధ్యాత్మిక పరాకాష్టతయైన మోక్షమార్గము చూపునదీ గీతగోవింద కావ్యము. ఈ కావ్యమును శృంగార కావ్యముగా కొందఱు భావించవచ్చును, కానీ కామముకూడ శాశ్వతమైన భక్తిసాధకమని ఈక్రింది శ్లోకమున వెలుంగవలసియున్నది.

శ్లో॥ భక్తిః కామసమేతాపి కామాంతే న నివర్తతే
శ్రద్ధా వృద్ధా పరే పుంసి భూయ యేవాభివర్ధతే॥

(భగవాన్ రమణ మహర్షి)

మరియు నీక్రింది శ్లోకములవలన రాధాకృష్ణుల అమలినప్రేమైక్యత తెలియ వచ్చుచున్నది,

శ్లో॥ కృష్ణమూలా కృష్ణశాఖా కృష్ణహృత్పద్మ కర్ణికా
కృష్ణజీవాత్మకా రాధా వృషభాను తనూద్భవా॥

శ్లో॥ శ్రీకృష్ణ నయనానంద రసకర్పూర వర్తికా
శ్రీకృష్ణానన పూర్ణేందో రాధికా చారుచంద్రికా ॥

రాధ యను పేరుగల పురాణకాంత లనేకులున్నారు, గర్గ భాగవతమున గోలోక ఖండమున రాధాదేవి చరిత్ర చాలా యుత్కృష్టముగా చెప్పబడినది. గోలోకాధిపతులగు రాధా కృష్ణులు ద్వాపరయుగంలో రాధాకృష్ణులుగా జన్మించినట్లు గర్గసంహితలో శంఖచూడోపాఖ్యానములో చెప్పబడినది. ఇంద్రాణియే రాధగా జన్మించినట్లు పూర్వగాథాలహరిలో తెలుపబడియున్నది. శతగోపుని పుత్రికయగు గోపికయే రాధగా చెప్పియున్నారు. ఏదిఏమైనా రాధ పదహారువేల గోపికాస్త్రీలలో అష్టమహిషులలో నగ్రగణ్యయైన శ్రీకృష్ణ ప్రేమైక స్వరూపిణి.

గీతగోవిందమునందు రాధాకృష్ణుల అచంచల ప్రణయము వర్ణితము. నిర్దిష్ట శృంగారశాస్త్రమున కీ కావ్యము లక్ష్యము. సర్వ శృంగారావస్థలు ఇందు వర్ణించబడినవి. సంస్కృత సారస్వతమున పఠనీయమైనది. సంగీత ప్రపంచమున గానయోగ్యమైనది. ఇట్టి కావ్యమును ఆంధ్రాళికి స్వీయభాషలో నందించిన శ్రీమాన్ యల్లకరి తిరువేంగళ సూరిగారు మాన్యులు ధన్యులు పుణ్యులు.

శ్రీ సూరిగారు మాకు మంచిమిత్రులు, సహృదయులు, సూరిజన మనో రంజకులు. పద్యకవిత యందును గేయకవిత యందును సవ్యసాచి. కవిత్వంలో మంచి శిల్పాన్ని చూపగల నిపుణులు. వీరు ఇంకను రస వంతములైన కావ్యములను రచించి సరస్వతీదేవి కమూల్యాభరణాలుగా సమర్పించి రసోపాసకులకు ఆనందాన్ని చేకూర్చగలరని ఆశిస్తూ సహృదయ

మా గురుదేవులు డా॥ ప్రసాదరాయ కులపతిగారి అమూల్యాభిప్రాయము శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థికసహాయము ఈగ్రంథ ఉత్తమత్వమును జాటుచున్నవి. పండిత పామర మనోరంజకమై సలక్షణమైన ఈగ్రంథము ప్రతి సారస్వతేయుని యింటియందును ప్రభుత్వ ప్రభుత్వేతర గ్రంథాలయములయందును నుండదగినదిగా భావించుచున్నాను.

ఇతిశమ్.

ముడివేముల

యువ, కార్తికం

విద్వజ్జన విధేయుడు,

**పుల్లాపంతుల రాధాకృష్ణమూర్తి.**



# డాక్టర్ ప్రసాదరాయ కులపతి,

అవధాని, ఆశుకవి, రూపక సమ్రాట్

శ్రీనాథ పీఠ నిర్వహణాధ్యక్షులు,

ప్రిన్సిపాల్, హిందూ కాలేజి

**గుంటూరు.**

సంస్కృతమున ఆలంకారికులు రససిద్ధాంతమును గూర్చి సమగ్రమైన చర్చ చేసియున్నారు. శృంగార వీర కరుణాద్భుత హాస్య రౌద్ర భీభత్స భయానక శాంతములు తొమ్మిదింటిని మాత్రమే రసములుగా నిర్ధారించినారు. ప్రేయోరసము వత్సలరసము మొ॥ వానిని కొందరు రసములుగా ప్రతిపాదించినారు. వానిని రసస్థితి నందజాలని భావములుగా మాత్రమే ప్రామాణికులు భావించినారు. ఒక్క భక్తి విషయమున మాత్రము ఎక్కువచర్చ జరిగినది. భగవద్గాథలను వర్ణించు సందర్భములలో వీరకార్యములు వచ్చినపుడు వీర రసము, ఆశ్చర్యకరమైన మహిమలను వర్ణించుపట్టుల అద్భుత రసము, శమప్రధానమైన బ్రహ్మచైతన్యముగా భావించిన సందర్భముల శాంతరసము, ప్రేమ కామ భావముతో ఈశ్వరు నారాధించిన వేళ శృంగారరసము, ఉదయించునేగాని ప్రత్యేకముగా భక్తి ఒకరసము కాజాలదని - భక్తి ఏభావము నాశ్రయించినప్పుడు తత్సంబంధిరసము వ్యక్తమగుననియు, సాహితీప్రపంచ విరించనులు సంభావించిరి.

కాని లౌకికమైన శృంగారముకంటె భిన్నమై కేవల ప్రేమ స్వరూపుడగు శ్రీకృష్ణుడు నాయకుడుగా జీవాత్మ పరమాత్మల ఐక్యమును సాధించు మధుర భక్తి సాధన - దానికి సంబంధించిన వాఙ్మయము భక్తిరస ప్రపంచము లోనికి వచ్చునని కొం...

కృష్ణోపాసకులైన మహాభక్తులు భావించిరి. బృందావన గోస్వాము లనేకులీమార్గమునకు చెందిన ఆలోచనాపరులే. స్వామి మధుసూదన సరస్వతి ఈభక్తిరసమునకు సంబంధించిన ప్రామాణిక గ్రంథరచన చేసి సాహిత్యశాస్త్రములలో పాండిత్యస్ఫోరకమైన భక్తిరస సిద్ధాంత మునకు ఒక మహాప్రస్థాన ప్రవర్తకుడైనాడు.

భగవదారాధనకు తత్కరుణాప్రాప్తికి భావతీవ్రత ప్రధానము. అది, యేభావమైనను కావచ్చును.

శా॥ కామోత్కంఠత గోపికల్ భయమునన్ కంసుండు వైరక్రియా
సామగ్రిన్ శిశుపాల ముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు భక్తినేమునిదె చక్రింగంటి మెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠుడైన హరి జెందన్వచ్చు ధాత్రీశ్వరా!

పోతన భాగవతమున నారదుడు ధర్మరాజుతో చెప్పిన పట్టమ్మిది. గోపికలు కామోత్కంఠత చేత హరిని పొందినారు. అధి శృంగారాత్మకము. ఆ గోపికలలో శ్రేష్ఠురాలు, మధుర ప్రేమభక్తికి అత్యున్నత ప్రతీక శ్రీ రాధాదేవి. ఆ రాధాకృష్ణుల ప్రేమవిహారము లను వర్ణించునదే జయదేవుని గీతగోవిందము. విరహ వశులై ఆ ప్రేమమూర్తులు ఆడిన ఆటలు, పాడిన పాటలు, చేసిన చేతలు రసమయ కవితాకృతి ధరించి రసిక భక్తులకు భావుకులకు ఆస్వాద నీయములైనవి. మధురభక్తిసాహిత్యములో మకుటాయమానమైన రచన యిది.

ఇంతకు ఈ మధురభక్తికి, ఈ భాగవత్పరమైన శృంగారమునకు మూలమైన భాగవత దశమస్కంధమున ఎక్కడను రాధా నామము లేదు. దీనికనేక కారణములు పండితలోకములో ప్రచారములో నున్నవి.

# XVI

1) శ్రీ [illegible]
చుండగా ముందురోజు రాత్రి రాధాదేవి శుకునకు కన్పించి, "పరీక్షిత్తు ఏడురోజులలో మోక్షమును మాత్రమే కోరుచున్నాడు. తదతీతము, తదధికములైన ప్రేమసామ్రాజ్యము నాతడు వాంఛించుట లేదు. దాని కర్హతయు లేదు. కావున సర్వాధిక ప్రేమతత్వము తెలుపు నా నామము, గాథలు అతనికి చెప్ప వలసిన పని లేదు. అదియునుగాక అక్కడికి వచ్చు శ్రోతలలో రసికభక్తుడెవ్వడును లేడు. కనుక నా నామము, నీ భాగవతమున తెలియజేయకుము" అన్నది. అందుచే శుకుడు కావలెనని రాధా నామము వదలినాడు.

2) భాగవత నాయకుడు శిష్టరక్షణకు దుష్టశిక్షణకు అవతారము లెత్తు వైకుంఠనాథుడగు విష్ణువు అతనికంటె సర్వాధికుడు, ప్రేమ సామ్రాజ్య వల్లభుడు – అగు గోలోకనాయకుడు కృష్ణుడు. అతని ప్రేయసి సర్వేశ్వరి రాధాదేవి. విష్ణువు వారలకు పుత్రుడు. పుత్రుడు తల్లితో విహరించినట్లు వర్ణించుట ఉచితముకాదు. కనుక విష్ణు భాగవతమున రాధాదేవి పేరుండరాదు. ఉండరాదు కావుననే లేదు.

3) బ్రహ్మ వైవర్తపురాణమున, గర్గసంహితయందు నరసింహుడు, శ్రీరాముడు, వైకుంఠవిష్ణువు, శ్వేతద్వీప నారాయణుడు, నారాయణ మహర్షి, ఇందరును గోలోకకృష్ణునిలో కలసిపోయినారు. రాధా వల్లభుడగు ఆ గోవిందుడే భూలోకమున రాక్షస సంహారమునకై వాసుదేవునిగా అవతరించి, నందవ్రజమున పెరిగి, రాసక్రీడలుచేసి బాల్యానంతరము రాక్షసమర్దనము చేసినాడు.

4) బృందావన స్థాపిత గాథల ననుసరించి అక్కడ ఆశ్రమాధిపతుల, పీఠాధిపతుల, సంప్రదాయము ననుసరించి, వైకుంఠవిష్ణువు వసుదేవుని సుతునిగా ఉదయించినాడు. అతనిని వసుదేవుడు తెచ్చి

# XVII

నందగోకులమున యశోద ప్రక్కలో నుంచబోయినాడు. ఆమె కొక ప్రక్క బాలిక రెండవప్రక్క గోలోకకృష్ణుని శిశురూపము కలదు. ఆ శిశువులో ఈ శిశువు కలిసిపోయినాడు. గోలోకకృష్ణుని అప్రాకృత దేహములో వైకుంఠనాథుడుండి తరువాత విడిపోయి అక్రూరునితో మధురకు వెళ్ళి కంసనంహారము, రుక్మిణీకళ్యాణము, భారతయుద్ధము మొ॥ చేసినాడు. గోలోకకృష్ణుడు "బృందావనం పరిత్యజ్య పాదమేకం న గచ్ఛతి" అని ప్రతిజ్ఞచేసి అక్కడనే ఉండి ఈ కల్పాంతమువరకు రాధాదేవితో రాసచేయుచు, ప్రేమభక్తుల ననుగ్రహించుచు నుండును. ఈ వాఙ్మయము ప్రకారము కూడ రాధా వల్లభుడు గోలోకకృష్ణుడేకాని వైకుంఠనాథుడు కాడు.

కాని ఈ వివరములు లోకమున నంత ప్రచారములో లేవు. భాగవతము, భారతభూమి నలుమూలల వ్యాపించినది. దాని ప్రకారము వైకుంఠవిష్ణువే సర్వేశ్వరుడు. అతడే వాసుదేవ కృష్ణుడై గోపికలతో క్రీడించినాడు.

భాగవతమున రాధపేరు లేకపోయినను, గోపికలలో రాధ ఒకరు కాన ఆమెకూడ కృష్ణప్రియయే. రాధాకృష్ణుల విరహగాథలు, రాసక్రీడలు, లోకమున బాగుగా పరివ్యాప్తి చెందినవి. ఈ గోలోకము-ఆ కృష్ణుడు - ఈ కృష్ణుడు - వీరి భిన్న తత్వములు అందరికి అంతగా తెలియవు. జయదేవునకును, తెలిసినట్లు కనబడదు. అందుకే అతడు వాసుదేవకృష్ణునే నాయకునిగా స్వీకరించి, అతని దశావతార వైభవమును, దుష్టసంహార సామర్థ్యమును ప్రేమశృంగార విలాస నైపుణ్యమును, ధీరనాయకునిగా ఆతని మహత్వమును తనివిదీర వర్ణించినాడు. తీసికొనని వృత్తాంతములనో, లేనిదానినో, ఎందుకు లేదని చర్చించుటకంటే, స్వీకరించిన దెట్టులు రచించినాడు. రస పోషణ ఎట్లు చేసినాడనుట ప్రధానము. ఆదృష్టితో పరిశీలించినచో

శృంగార ప్రధానమైన భక్తిభావమును వర్ణించిన కవితారూపములలో జయదేవుని గీతగోవిందము అగ్రశ్రేణికి చెందినదనుట నిస్సంశయము. బృందావన యోగుల సంప్రదాయమున పురుషార్థము లైదు. ధర్మార్థ కామ మోక్షములును, ప్రేమయు, అయిదవదగు ప్రేమ పురుషార్థము యొక్క మహత్వమును, అయోగ సంయోగ వియోగములలోని భావానుభవ తీవ్రతలను సాధికారముగా సోపపత్తికముగా మహాకవి భక్తకవియగు జయదేవుడు పరమాద్భుతముగా తీర్చి దిద్దినాడు.

ఇక అనువాదకుడగు యల్లకరి తిరువేంగళసూరిగారు పండిత కుటుంబమునకు చెందినవారు. సాహిత్యముతోపాటు సంగీతము నందు కూడ కృతశ్రములు. కావున ఈ గ్రంథానువాదమునకు తగిన అధికారము సహజముగా వీరికి సంప్రాప్తించినది. కమ్మని కంఠము, గాననైపుణి గలవారు. కావున కవిగా తాను వ్రాసినదానిని గాయకునిగా పాడి చూచుకొను అవకాశము లభించినది.

మరొక ముఖ్యమైన అంశము. సంస్కృతమునుండి అన్యభాష లోనికి అనువాదము చేయునపుడు అదే ఛందస్సును సామాన్యముగా స్వీకరింపరు. ఆవిధముగా తీసికొనుట భాషాలక్షణమునుబట్టి కొంత ఇబ్బందిగా ఉండవచ్చును. కాని ఇక్కడ అష్టపదులను తెనుగించు నప్పుడు అందలి మాత్రాఛందస్సులనే స్వీకరించి తిరువేంగళ సూరి గారు అద్భుతనిర్మాణము చేసినారు.

ఒకచిన్న ఉదాహరణము చూడుడు —

"తవకర కమలవరే నఖమద్భుతశృంగం,
దళిత హిరణ్య కశిపు తనుభృంగం, కేశవ !
ధృత నరహరిరూప ! జయజగదీశ హరే॥ (1–5)

# XIX

అనువాదము -

అమల కమలకర నఖరాగ్రమ్ముల, కనకకశిపు
ఘన కళేబరమ్మును, భృంగముగా నొనరించిన కేశవ!
ధృత నరహరిరూప! జయ జగదీశహరే!!

అనువాదములోని మృదుత్వమునకు మరొక ఉదాహరణ:

ఉరసిమురారే రుపహితహారే ఘనఇవ తరళబలాకే
తటిదివపీతే రతివిపరీతే రాజసి సుకృతవిపాకే॥
॥ధీరసమీరే యమునాతీరే॥ (5-11-5)

పున్నె పుకొమ్మవు వెన్నుని రొమ్మున
పురుషాయితమును సలుపగ
మేఘముతానై మెరపువునీవై చెలువుగ నలరుదు చెలియా॥
॥యమునాతటమున మలయానిలమున॥

తెనిగింపులోని సారళ్యమునకు శబ్దాలంకార ప్రీతికి ఒక
ఉదాహరణ :-

రతిసుఖసారే గతమభిసారే మదన మనోహరవేశం
నకురు నితంబిని గమనవిళంబన మనుసరతం
హృదయేశం (5-11-1)

రతిసుఖనిధియగు సంకేతస్థళమున గల మన్మధరూపుని
నీ ప్రియు సరసకుబొమ్మా! జాగునుసేయకె
బంగరుబొమ్మా!

మరియొక ప్రసిద్ధపదమునకు తెనుగింపున వచ్చిన యింపు పెంపులను పరికింపుడు -

స్మరగరళ ఖండనం మరశిరసి మండనం
ధేహి పదపల్లవ ముదారం
జ్వలతిమయిదారుణో మదన కదనానలో
హరతు తదుపాహిత వికారం. (10-19-7)

ఇందలి మొదటిపాదములోని ద్వితీయార్థము సాక్షాత్తు కృష్ణుడే వ్రాసినాడని ప్రతీతి.

మరువిషము విఱుచునవి నాశిరము మెఱచునవి
నీ యడుగు తలిరులను నిడుమీ
రతిరాజు సెగచిచ్చు రగులనీయక పెచ్చు
అయ్యువి వికారముల బాపున్॥

అష్టపదుల అనువాదమున ఆ ఛందస్సునే ఎన్నుకొనిన కవి శ్లోకముల తెనుగుసేయునప్పుడు మాత్రము తెలుగులో ప్రసిద్ధములైన ఛందములకు మార్చినారు. అది ఉచితముగానే యున్నది. ఏలన సంస్కృతశ్లోకముల ఛందస్సులకు తెలుగులో ప్రయోగము తక్కువ. అలవాటులోనున్న ఉత్పల చంపక గీతాదులను ఉపయోగించుటయే రమ్యముగా నుండును. ఆ యనువాద సౌందర్యమునకును ఒకటి రెండు ఉదాహరణముల చూడుడు.

శ్లో॥ యదిహరిస్మరణే సరసం మనో
యది విలాస కలాసు కుతూహలం
మధుర కోమల కాంత పదావళీం
శ్రుణు తదా జయదేవ సరస్వతీం॥

గీ॥ హృదయమేవేళ శ్రీకృష్ణ - పదములందు
భక్తిరసమున స్వచ్ఛమై పరగునపుడు,
సుకవి జయదేవ యత్యుక్త - సుభగ గాన
మధురభారతి వినరయ్య - మనములలర॥

ఇక్కడ జయదేవ యత్యుక్త - అను పదమందలి యతిశబ్దము, గ్రంథానువాదకుడగు యల్లకరి తిరువేంగళసూరి సంకేతనామము - ఈకృతి యంతటు ఈ శబ్దమే ఉపయోగించబడినది. జయదేవుడు యతి యెట్లైనాడన్న భ్రాంతి ముందు కలిగినను, విషయము తెలిసికొనిన పిదప ఆ యిబ్బంది ఉండదు.

అనువాదము సంగతి నటుంచి విడిగా చదువుకొన్నను మరల మరల చదువవలెననిపించు ఈపద్యము పఠింపుడు.

మ॥ అలరన్ భూషణముల్ ధరించుమెయి, ఆకల్లాడ శంకించు రా
కలు సీవంచు, రచించుపాన్పులను, శృంగారించి ధ్యానించు ని
చ్చలు, నాకల్పవికల్ప తల్పరచనా సంకల్ప లీలాశతం
బుల రేలన్ వెడలింపగా గలుగునే పూబోడి నిన్వీడియున్.
6-40.

అటులే పద్యమునకుగాని గద్యమునకుగాని మొదలుపెట్టగనే చదివించుట అనునది ప్రధాన లక్షణము. ఆ లక్షణమునకు శబ్దార్థ రమణీయకత భావశబలత తోడైనచో ఇంక అంతకంటే కావలసిన దేమున్నది. ఆ పుష్టికొక ఉదాహరణము.

ఉ॥ ఏమని పల్కుదాన ? మది యెంతటిపాడుదొ ? అన్యభామినీ
ప్రేమ పయోధిలో మునిగి క్రీడిలు కృష్ణునె కోరుచుండు, నా
స్వామిగుణంబులన్బొగడి సంతసమందును; రోయదెన్నడున్॥
రామ ! విచిత్రమౌ తిరిగిరాదిక నాదరి యేమి సేయుదున్॥

కృష్ణప్రేమలోని ముఖ్యమైన సూత్రమిందు నిబిడమైయున్నది. పరకాంతా కాముకుడైన స్వామిని లోకములో సహింపలేరు. కాని రాసమండలిలో పురుషుడొక్కడే. అతడు పరమపురుషుడగు కృష్ణుడు. గోపికలు కృష్ణునిపై ఈర్ష్య వహించినను, అలుకచెందినను పరగోపికా సక్తుడని తరస్కరించినను, మరల సమాధానపడి అతనినే ప్రేమింతురు. వీలననగా అతడు ఒక్కడే కాడు ప్రతియొక్కరికొక్కడు కాగలడు, సహస్రమూర్తిధారియై విరహవివశలను ప్రేమవివశలను చేయగలడు. అటువంటి కృష్ణునిగాక మరెవ్వరి నారాధింతురా గోపికలు? గోపికా నాయికయైన రాధాదేవియు, కృష్ణునికై పరితపించినది. కృష్ణునికై జీవించినది. కృష్ణునకు సర్వస్వమును సమర్పించినది. ఆ యిద్దరి ప్రణయలీలలీగ్రంథమున జయదేవ భణితమైనవి. తిరువేంగళసూరిచే లలిత రమణీయముగా నాంధ్రీకరింప బడినవి. కావ్యము ముగింపు సందర్భమున 12వ సర్గమునందు జయదేవుని శ్లోకమునకు వచ్చిన అనువాదములోని ఆత్మశుద్ధిని భక్తిశ్రద్ధలను జూడుడు.

ఉ॥ ఎయ్యది విష్ణుచింతనము నెయ్యది గానకళా సుకౌశలం
బెయ్యది యుజ్వలప్రథిత మెయ్యది యీక్షితి మోక్షసాధకం
బయ్యది పండితాళి కొనియాడ రచించిరి సంస్కృతంబునన్
తియ్యతెనుంగునందు జయదేవకవీంద్ర యతీంద్రులిర్వురున్.

ఉజ్వల శబ్దమునకుగల శృంగారార్థమీ పద్యమునకు వన్నె-వెట్టుచుండ తెనుగున కమనీయమైన రచన ఉదయించినది. ఇంత మంచి రచన-రసరమణీయమైన కవితాసృష్టిగావించినందులకు సూరి గారిని హృదయపూర్వకముగా అభినందించుచు, ఇది మధురభక్తి హృదయుడైన ప్రతి కవితాప్రియుడు చదువవలసిన గ్రంథముగా భావించుచున్నాను.

(సం.) డా॥ ప్రసాదరాయ కులపతి.

శ్రీ తురిమెళ్ల ఆదిశేషగిరిరావు, B. Sc.,
కల్లూరు.

# నవరత్నమాల

శా॥ శ్రీరాజత్సుఖమైన మోము దరి జే-రెన్, మోవి బింబంబులన్
తారాడెన్ కుచకుంభయుగ్మముల చెం-తన్ నిల్చె, నా రాధికా
నీరేజేక్షణ మేఖలావిభవమానెన్; ప్రేమతో నెద్దియో
గోరం ద్రిమ్మరు కృష్ణుచూడ్కులిడు నీకున్
భోగ భాగ్యాయువుల్. 1

ఉ॥ సార సరస్వతీ కుచ వి-శాల తటీ నటనానుకూల వి
స్తార తరానురాగమయ - చారుకరంబు, కరంబు నిర్మలో
దార విహారహారియయి - తాపముబాపగ నాత్మతృప్తి నిం
డార విరించి మించిన ద - యామతి నిన్ను
ననుగ్రహించుతన్॥ 2

మ॥ రసశృంగార విహార భావగరిమన్ - రాజిల్లు రాధామనో
ల్లసితానందము నందనందనుని లీ-లాకృష్ట సంశ్లేషలన్
ప్రసవామోద కుడుంగదేశ సువిహా - రంబెంతొ రమ్యంబుగా
వెస చిత్రించిన నీ కవిత్వ రచనా - పేక్షన్ ప్రశంసించెదన్॥ 3

మ॥ లలితంబౌ జయదేవు నష్టపదులన్ - లక్ష్యంబుగానెంచి, యు
జ్వల భావంబుల తేటతెన్గున రస-జ్ఞ శ్రేష్ఠులున్ మెచ్చు చున్
తలలూపం దగజేసినావుగద మే-ధాశక్తితో; మాలలన్
తెలుగుంభారతి నీదు కావ్యసుమముల్ - దీర్చున్
గళాగ్రంబునన్॥ 4

శా॥ బాగొప్పన్ తెనిగించినావుగద సద్భక్తిన్ సుధల్‌జిమ్ము గీ
తాగోవిందము, నందు నందు మధురార్థంబుల్ సువిద్వంద్యమై
సాగెన్, శైవజటాటవీ గళిత భాస్వద్దివ్య స్రోతస్వినీ
రాగాలాపన కుద్దియై పదవిహారప్రౌఢికిన్ గద్దియై॥ 5

శా॥ నీవున్నే నొక తీరవాసులమె, వాణీపాదపద్మ ద్వయీ
సేవాసక్తులమే, మనోజ్ఞ కవితా శృంగారపుం బూల నె
త్తావుల్ జిమ్మెడు వారమేయయిన పాత్రంబైన గాత్రంబునన్
నీవందించెడు రాగమాలికల బాణిన్ వాణి మోదింపదో ! 6

మ॥ కరుణామూర్తిని జేరిమ్రొక్కి, మురళీగానంబులన్ జొక్కి. దు
ర్భర సూనాస్త్రనిబారి జిక్కి, విరహజ్వాలాగ్ని చే బొక్కి, శ్రీ
హరి కౌగిళ్ళను స్రుక్కి, మేన్మఱచు దివ్యానందసౌఖ్యాబ్ధి ద
క్కి. రతిన్ నిక్కిన రాధ సచ్చరిత నీకేచెల్లు కీర్తింపగన్॥ 7

సీ॥ గళమెత్తి పాడెనా - గాంధర్వ గాయక
నివహంబు నివ్వెఱ - నిలచిచూచు;
భాషింపనెంచెనా - భాగీరథీ ధునీ
ప్రోత్తుంగ లహరుల - బ్బురముజెందు;
నటునగావించెనా - నగధారి లోక నా
టక సూత్రధారి పా - టవము దలకు;
రచియించి మించెనా - రసమయేక్షు మధు ద్ర
వామృతంబుల చవు-లణగి మణగు;

ననుమ గాత్రంబు భాషను - ననుపమాన
నటన నద్భుతరచనల - పటుతరముగ
కీర్తనల్‌జేయ ప్రజలు స - త్కీర్తి గనుమ
యల్లకరివంశ తిరువేంగ - ళాఖ్య సూరి ! 8

చం॥ వినదగు నీదుగానమును - వీనులవిందుగ నెన్న డేనియున్
కనదగు నీదు సత్కవిత - కల్పనజేసిన భావమాధురుల్
మనదగు నీదు భవ్యమగు-మార్గమునన్ భవముండునంతకున్
వినుత కళావిహారి ! తిరు-వేంగళసూరి! మనోజ్ఞ వాగ్ఝరీ ! 9

ఒడ్డుపాళెం
12-1-96.

[సం.] తురిమెళ్ల ఆదిశేషగిరిరావు.

---

# శ్రీ అయితి హనుమంతరావు

గణపవరము

మ॥ జయదేవుం గొనియాడి సంస్కృతమహా - సత్కావ్య సౌరభ్య మె
ల్లయెడం జిమ్మ రచించె నాంధ్రమున తా - శజ్ఞాన రాగామృతో
దయ మొప్పన్ తిరువేంగళాఖ్యుడు; ధరన్ ధన్యుండు; శ్రీనాధుడే
స్వయమున్ స్వీకరణం బొనర్చె నటు మె - చ్చుండే హనూమంతుడున్॥

(సం.) అయితి హనుమంతరావు.
గణపవరం
1-9-96.

# మల్లవరపు జాను

భాషాప్రవీణ - మధురకవి.

రాష్ట్రస్థాయి బహుమతి గ్రహీత.

## ఆశంసనము

మ॥ నయగారంబుల సొంపుతో తెలుగులో - నన్ గీతగోవిందమున్
నియతామోద పదార్థ రత్నములతో - నిర్మించి, భాషామహో
దయులెల్లన్ తలలూపజేసిన కవీంద్రా ! నేడు మీ రూపునన్
జయదేవుండు తెలుంగునేల మఱలన్ - జన్మించె నంచెంచెదన్॥

సీ॥ తీయని కైతల - వ్రాయ నేర్చినవాడు
పదుగురు నుతియింప - బాడలేడు,
పదుగురు నుతియింప - పాడగల్గినవాడు
తీయని కైతల - వ్రాయలేడు,
కైత నేరిచి పాడ గలిగిన మొనగాడు
సొంపు పెంపులతో న - టింపలేడు
కైతనేరిచి పాడ - గలిగి నటించు వా
డితరవాద్యముల వా - యించలేడు

గీ॥ ఒక్కొకరొకొక్క విద్యలో - నొప్పుచుండ
వరుస వ్రాసి పాడి నటించి - వాయిదముల
కైవసము జేసికొని కీర్తి - గాంచినారు
ఆంధ్ర గీతగోవిందక - ర్తా ! జయోస్తు !

XXVII

గీ॥ విప్రలంబ శృంగార ప - విత్రకృతిని
పరుల మెప్పుల కొఱ కాశ - పడక మీరు
నందనందన సేవనా - నంద రతిని
కూరిచితి, తిరువేంగళ - సూరివర్య !

గీ॥ మధువులొల్కు మీ కావ్యంబు - చదివినాడ,
వింటి మీరు గానముసేయ - వీనులార,
కంటి మీ స్ఫురద్రూపంబు - కన్నులార,
మ దభినుతి వెల్లడించితి - మనసు దీర॥

చీమకుర్తి,
22-8-96.

[సం.] పల్లవరపు జాన
మధుర కవి.



T. VENKATESWARLU
M.Sc , F Z.S., F.Z.S.I., F.A.Z., F.A S,Z.
Deputy Director (R)

M I/F., M.I.G., FLATS
Lattice Bridge Road,
Thiruvanmiyur.
Madras – 600 041

I have gone in depth the Andhra Gita Govindam by Sri Y. Thiruvengala Suri. He has done a lot of research on original 'Gita Govindam' by Jayadeva in Sanskrit and translated it in a very rhythmic style in Telugu. It is undoubtedly a fine piece of work. I heard them when he was singing in a melodius voice. The mellifluvoice and the 'Honey-like' Telugu rendering gave me an impression that Jayadeva himself would have been happy had he heard him. In his work not only the original meaning is depicted in a superb way without any slang though the original work is based on Sringara rasa.

In any translation not only the original meaning but also the original rasa, bhava and bhakti have to come. Sri Suri fullfilled these points in this magnum opus.

Many would have heard the original Ashtapadis in Sanskrit sung by several including Telugu Film 'Bhakta Jayadeva'. But these new Teiugu Ashtapadis surpass the Sanskrit ones when sung by the author.

There are no words to congratulate him for bringing out such a beautiful work in Telugu and Telugu literature is enriched by this Kavyam. It is another gem in the necklace to the Andhra Bhasha Saraswati. All Andhras should be proud of this work.

May Almighty give him hundred years of life to bring out more immortal works like the Gita Govindam in Telugu.

*(Sd.) T. VENKATESWARLU*



# విజ్ఞప్తి

సరసులకు, సంగీత సాహిత్య కళాపిపాసకులకు,
పండిత ప్రకాండులకు ప్రణామములు.

గోలోకాధీశ్వరి - పరాశక్తి - శ్రీకృష్ణ ప్రేమైకస్వరూపిణి యగు రాధ పాత్ర జయదేవుని గీతగోవిందమునందు బృహత్తరంగా నున్న కారణంగా నా యీ ఆంధ్ర గీత గోవిందమునకు, "గీత మాధవము" అను నామాంతరము నిడితిని. మాధవ శబ్దమునకు కృష్ణుడనియే గాక "రాధ" అను అర్థమున్నది "వైశాఖే మాధవే రాధా" అని అమరము. మాధవ శబ్దమునకు రాధాకృష్ణుల నామములు రెండును గోచరించుచున్నవి గాన "గీతమాధవ" మను పేరు సమంజసముగా నున్నదని భావించితిని.

కొందఱు భావించినట్లుగ రాధ శ్రీకృష్ణునకు మేనత్తయు నుంపుడుగత్తెయుగాక, గోలోకాధీశ్వరి - త్రిగుణాత్మిక - ఆదిగోపిక.

రాధ :- శ్లో॥ అనయారాధ్యతే కృష్ణో। భగవాన్ హరిరీశ్వరః
లీలయా రసివాహిన్యా। తేన రాధా ప్రకీర్తితా॥

శ్లో॥ రాధికాపి పరాశక్తిః। కృష్ణే చానందరూపిణీ
నిత్యాచ నిత్యసత్యస్మిన్। స్వాధారే పురుషోత్తమే॥
(బృహద్బ్రహ్మ సంహిత)

శ్లో॥ రమయాతు రకారస్యా। దాకారేఽస్త్యాదిగోపికా
ధకారోధరయాహిస్యా। దాకారే విరజానదీ॥

అనెడు ప్రమాణములున్నవి.

శ్రీకృష్ణుడు :-

శ్లో॥ కృషి ర్భూవాచకశబ్దః। ణశ్చ నిర్వృత్తివాచకః
తయోరైక్యపదం బ్రహ్మ। కృష్ణ ఇత్యభిధీయతే॥

శ్లో॥ సచ్చిదానందరూపాయ। కృష్ణాయాఽక్లిష్టకారిణే
నమో వేదాంతవేద్యాయ। బ్రహ్మణే పరమాత్మనే॥
(బృహద్బ్రహ్మ సంహిత)

శ్లో॥ సద్యః ప్రాణి పవిత్రాణి। జగతాం మంగళానిచ
కకారః కమలాకాంతః। ఋకారో రామ ఇత్యపి॥

శ్లో॥ షకారో షడ్గుణపతిః। శ్వేతద్వీప నివాసకృత్
ణకారో నారసింహోయ। మకారోహ్యక్షరోగ్ని భుక్॥

శ్లో॥ విసర్గోచ తథాహ్యేతౌ। నరనారాయణావృషీ
సంప్రలీనాశ్చ షట్పూర్ణా। యస్మిన్ శబ్దే మహామునీ॥

శ్లో॥ పరిపూర్ణతమే సాక్షా। త్తేన కృష్ణః ప్రకీర్తితః
శుక్లో రక్తస్తథా పీతో। వర్ణోఽస్యను యుగంధరః॥
(గర్గసంహిత - గో - అ 15)

శ్లో॥ శేషో నాగో భవేద్రామః కృష్ణో బ్రహ్మై నశాశ్వతం.
(అధర్వణి కృష్ణోపనిషత్తు)

అనెడు ప్రమాణములంబట్టి శ్రీకృష్ణుడు జార చోరాదులలో జేరని మహాత్ముడనియు, పరాత్పరుండనియు, పరిపూర్ణతముండగు భగవానుడనియు తెలియుచున్నది.

గోలోకాధీశ్వరియైన రాధ, శ్రీదాముని శాపకారణంగా 100 సంవత్సరముల్లు గోలోకపతియైన కృష్ణునివీడి భూలోకంలో ద్వాపరయుగంలో వృషభాను కూతురు రాధగా పుడుతుంది. గోలోక

నాథుడైన శ్రీకృష్ణపరమాత్మ దుష్టశిక్షణ శిష్టరక్షణార్థము దేవకీ వసుదేవులకు జన్మిస్తాడు. రాధాకృష్ణులకు వివాహము బ్రహ్మదేవునిచే కావింపబడినట్లు గర్గసంహిత బృందావన గోలోకఖండములో వివరింపబడినది.

గోపికలు :- "గో" అనగా ఇంద్రియము. ఇంద్రియములను వశపఱచుకొనినవారలు గోపులనియు, గోపికలనియు కాగలదు. అనగా జితేంద్రియులని అర్థము. ఆ జితేంద్రియులే మునులు. ఈ మునులు శ్రీరామచంద్ర వామనాద్యవతారంబులను పరాత్పరుండెత్తినపుడు ప్రార్థించి వరంబులు గైకొని గోపికలుగాబుట్టి తమ మనోరథంబుల దీర్చికొన్నవారు. కాన వారు కామాంధలగు గొల్లతలు గారు. ఈ విషయము అథర్వణ కృష్ణోపనిషాదులును బ్రహ్మవైవర్తాది మహాపురాణంబులును విశదీకరించినవి.

పరిపూర్ణతమావతారుండైన శ్రీకృష్ణస్వామిపైగల భక్తి, కవితా గానముల యందనురక్తి నన్నీ యాంధ్రీకరణమునకు పురిగొల్పినది. గురుముఖంగా కవితాగానములు నేర్చినవాడను గాను. ప్రకృతియే పాఠశాలగా, కృష్ణస్వామియే గురువుగా భావించి కవితా సంగీతములను సాధన జేసితిని. అల్పజ్ఞుడనైన నేను జయదేవ మహాకవి కృతమైన గీతగోవిందమును ఆంధ్రీకరించుట సాహసోపేతమైన కార్యమే.

జయదేవుడు భక్తి, శృంగారం, కవిత్వం, సంగీతాలను సమపాళ్లలో నుండేవిధంగా తన గీతగోవిందమును రచించాడు. రాధాదేవిని అష్టవిధనాయికలుగా అభివర్ణించాడు. ఏ అష్టపదినినైన విన్నచో సంస్కృతం రాని శ్రోతయైనను, తలయూపి తాళము వేయవలసినదే- అట్టి రసానుభూతిని గల్గించే కవిత్వం "న భూతో

న భవిష్యతి” అందులకే భక్తితో భయముతో నా ఆంధ్రీకరణమును కొనసాగించితిని.

మరియొక కారణము :— 25 సంవత్సరముల ప్రాయములో నేను 50 పేజీల “కన్నయ్య కామకళాకళిక” అను పెద్ద గేయమును రచించితిని. దానిని పూర్తిగానాలకించి సంతోషించిన “అన్న సముద్రం” నివాసియు, సద్బ్రాహ్మణుండును, సకలగ్రంథ పారంగతుండును, సత్యభాషియు, జ్ఞాన వయోవృద్ధులునైన శ్రీయుత శిష్టి శ్రీరాములయ్యగారు “నీగేయం సంపూర్ణ శృంగార ప్రబంధం - కాని నాయిక అనామకురాలు. నీవు జయదేవ గీతగోవిందాన్ని ఆంధ్రీకరించుటకు ప్రయత్నించు” మని యనగా నేను “రామశబ్దమే కంఠతరాని నాకు నది సాధ్యమా స్వామీ!” అని నే బదులాడగా, వారు “తప్పక నీవు వ్రాయగలవు. నాకా నమ్మకముంది” యన్నారు. ఇక ఆ విషయం నాకు గుఱుతును లేదు. 30 సంవత్సరముల తరువాత వినుకొండ కాఫీహోటల్లో, చిత్తుకాగితముల బుట్టలో చిరిగిన జయదేవుని గీతగోవిందము మూలము మాత్రము దొరికినది. దానిని ఇంటికి తీసుకొని వెళ్లి ఆమూలాగ్రంగా చదివి యెంతో ననుభూతి నందితిని. అప్పుడు శిష్టి శ్రీరాములయ్యగారి మాట గురుతుకు వచ్చినది. అంతులేని ఆవేశం ఆనందం గలిగినది. అందువలన శ్రీకృష్ణుని జయదేవుని నిష్ఠతో ప్రార్థించి, తులసీ పత్రములను సేవించి ప్రతి పద్యమును అష్టపదిని రచించితిని - రచన కొనసాగుచున్నది.

“ఝమ్మనుచు తుమ్మెదలు మెదలుచోటన్
కమ్మవిలుతుని తముల క్రీడింపవే”

21వ అష్టపది, 7వ చరణమును నే రచించునప్పుడు ఒక తుమ్మెద నేను వసించు గృహములోనికి ఝుమ్మనుచు వచ్చి ... బయటకు వెళ్ళుచూ నున్నది. ఒక్కొక్కపరి కప్పులోపలి దంతెలపై వ్రాలు

నపుడు "ఝుం" శబ్దము "జ్ఞం" గా ప్రస్ఫుటంగా వినిపించినది. అలా ఎన్నిసార్లు తుమ్మెద గృహములోనికి ప్రవేశించినదో ఆశ్చర్యంతో లెక్కించితిని. అలా 21 పర్యాయములు వచ్చి వెళ్ళినది. "ఝుం" శబ్దము "జ్ఞం" గా ఎందుకు వినిపించినదో ఆలోచింప సాగితిని. పరశురామావతారమెత్తి 21 పర్యాయములు క్రూరులగు రాజుల వధించి, దుష్టశిక్షణచేసిన ఆస్వామి. ఏకవింశత్యవతారంబుల నెత్తిన ఆ స్వామి, నేను 21వ అష్టపదిని రచించునపుడు తుమ్మెద రూపంలో "ఝుం" శబ్దమునకు అర్థము "జ్ఞం" గా తెలిపాడేమో యని వూహించితిని. "జుఱ్ఱుము" పదమునకు సంక్షిప్త రూపము "జ్ఞం" అని తెలిసినది. "మాధవుని అధరామృతమును లేక మోవి తేనెలను జుఱ్ఱుము రాధా" అని మన్మధుని పరివారమైన తుమ్మెదలు తెలుపుచున్నట్లు అర్థము గోచరించినది. ఈ విషయము నేననృత మాడుట లేదు. ఆడిన వచ్చు పాపఫలమునకు నేనేలోకములకు పోవుదునో ఇది విశ్వసింపనివారలును అదే లోకములకు పోవుదురు.

ఇక సంగీతం సమకూర్చుటలో 72 మేళకర్తలు ఒక్కొక్క మేళకర్తలో 484 జన్యరాగములు పరిశీలనజేసి రసమునకు తగిన రాగము నెన్నిక జేసితిని. అనేక పర్యాయములు హార్మోనియం సహాయంతో గానం జేసి కొందఱు గాయనీ గాయక మణులకు నేర్పించితిని. ఒక్కొకపరి అష్టపదికి సంగీతం సమకూర్చుటలో రెండు లేక మూడురాగములు సమప్రాధాన్యము గలవిగా దోచినపుడు ఆయా రాగములపేర్లు చీటీలలో వ్రాసి స్వామిపటమువద్ద నుంచి, లాటరీ తీసి వచ్చిన రాగముతో సంగీతము సమకూర్చి సాధన జేసితిని. ఈ రీతిగా నాకు తెలిసినంతవట్టు కృషి జేసితిని. ఎందఱో మహానుభావులు - ఎన్నో ఫక్కీలలో పాడుటకు ప్రయత్నింతురు గాక.

నా యీ ఆంధ్ర గీతగోవిందము నందేదేని మాధుర్యము
ఆ ఘనత జయదేవమహాకవిదే యనియు, దోషములున్న చో
పరిగణించవలయుననియు సవినయముగా మనవి జేయుచునా

శ్రీకృష్ణపరమాత్మ అవతారమైన శ్రీ శ్రీనివాసునికృపచే
బడిన నా యీ ఆంధ్ర గీతగోవింద కావ్య ముద్రణార్థము
సహాయ మొనరించినందులకు తిరుమల తిరుపతి దేవస్థానము
కృతజ్ఞతాంజలులు.

వేడినదేతడవుగ తడవుసేయక, ఎందరికో తెలియని ఎన్నె
విశేషములతో కూడిన తన అమూల్యాభిప్రాయము నొసంగిన
తుల్యులైన అవధానచక్రవర్తి ఆశుకవికేసరి రూపకసమ్రాట్ గుంటు
శ్రీనాథపీఠ నిర్వహణాధ్యక్షులునైన శ్రీ డా॥ ప్రసాదరాయ కుల
గారికి నా ప్రణామములు.

నా కావ్యము నామూలాగ్రముగా జదివి, అక్షరశోధ గావి
అశేష విశేషములతో గూడిన ప్రవేశికను ప్రసాదించిన సుహృన్మణి
కవితా సుధాకర బిరుదాంచితులు అష్టావధానులునైన శ్రీ పుల్లాపంత
రాధాకృష్ణమూర్తి గారికి నా నమస్సులు.

నా యీ ఆంధ్ర గీతగోవింద రచనాకాలమున నేను వ్రాసి
ప్రతి పద్యమును అష్టపదిని గానముచేయునపుడు అభిలాషతో వి
యానందించి నాకత్యంత ప్రోత్సాహమును కల్గించి, రత్నము
లాంటి పద్యములతో నభిప్రాయమొసంగిన విజ్ఞులు రసజ్ఞులునై
శ్రీ తురిమెళ్ళ ఆదిశేషగిరిరావుగారికి నా నమస్కృతులు.

నను తన యనుజునిగా భావించి యనవరతము ననురాగ
మును చిలికిస్తూ అనవద్య హృద్యపద్యములతో తన యభిప్రాయము

నొసంగిన మధురకవి శ్రీ మల్లవరపు జాను గారికి నా యభివందనములు.

సకాలములో అందముగా ముద్రించియిచ్చిన మార్కాపురం శ్రీ సాయిరాం ప్రింటర్స్ వారికి, ముద్రణలో సహాయ మొనర్చిన శ్రీమాన్ తిన్నవెల్లి రాఘవయ్యగారికి నా కృతజ్ఞతాభివందనములు.

అత్యంత సుందరముగా ముఖచిత్రమును చిత్రించిన చి॥ తిన్నవెల్లి శ్రీనివాసులకు ఆశీస్సులు.

ఒడ్డుపాళెం,
డిసెంబరు-96.

సుధీ సుజన విధేయుడు :
యల్లకరి తిరువేంగళసూరి.



# యతిశ్రీ తిరువేంగళ సూరిగారి వంశవృక్షము

తిరువేంగళాచార్యులు, కృష్ణమాచార్యులు

రంగశాయి
రంగమ్మ

- పెద్దకేశవాచార్యులు
  మంగమ్మ
  - హనుమాయమ్మ
    సత్యనారాయణరావు
- చిన్న కేశవాచార్యులు
  నరసమ్మ
  - 1 కృష్ణమాచార్యులు (Rtd. MRO)
    సూర్జస్వతి
    - 1 కేశవాచార్యులు (Ag. B Sc.,)
      శ్రీదేవి
      1. రవి 2. రజని
    - 2 పూర్ణకేశవాచార్యులు M. Com.,
      జయలక్ష్మి
      1. అనూష 2. అలేఖ్య
    - 3 చెన్న రామకృష్ణమాచార్యులు M. Sc.,
      శ్రీదేవి
      1. ప్రత్యూష 2. ప్రవీణ్
    - 4 విజయకుమార్ B. Sc., Ed.
      యుగంధర లక్ష్మి
      1. సాయికృష్ణ 2. పాప
    - 5 పార్థసారధి B. Sc., B.Ed.,
  - 2 కేశవమ్మ
    వెంకటనరసయ్య
  - 3 యతిశ్రీ తిరువేంగళసూరి
    సరోజ
    - 1 కేశవాచార్యులు (M. Tech,)
      నీలావతి
      1. వినీలశ్రీ 2. కళ్యాణచక్రవర్తి
    - 2 కేశవసూరి M. Sc., M.Phil.,
    - 3 లక్ష్మి దేవి B.A.,
      శేషయ్య
      1. రాజేశ్ 2 రాకేశ్
    - 4 వెంకటరమణమూర్తి B. Tech.,
  - 4 శేషమ్మ
    రంగయ్య

అంబపూజ చేయుటచేత ఎన్నో తరములనుండి దత తయే - రంగశాయినుండి సంతతి ప్రబలినది



అష్టపదుల సాధనలో యతిశ్రీ



శ్రీ వాసుదేవాయ నమః

శ్రీ కృష్ణాయ నమః

శ్రీ శ్రీనివాసాయ నమః

# కృతి సమర్పణ

గీ॥ అరయ పురుషోత్తముడవని - అర్హుడవని
కావ్య కన్యక నిడుచుంటి - కరుణతోడ
నేలుకో స్వామి! వెగ్గల - మేమి కాదు
వేల వ్రేతల గైకొన్న - బాలకృష్ణ!

కృతికర్త - యతిశ్రీ.

# రాగముల పట్టిక

| అష్టపది | రాగం | అష్టపది | రాగం |
|---|---|---|---|
| 1వ అష్టపది | మాళవ | 13వ అష్టపది | ముఖారి |
| 2వ ,, | కన్నడ | 14వ ,, | మాండు |
| 3వ ,, | కళ్యాణి | 15వ ,, | నాట |
| 4వ ,, | మారువధన్యాసి | 16వ ,, | హంసధ్వని |
| 5వ ,, | తోడి | 17వ ,, | మధ్యమావతి |
| 6వ ,, | జయంతశ్రీ | 18వ ,, | కాఫి |
| 7వ ,, | శ్రీరంజని | 19వ ,, | సౌదామిని |
| 8వ ,, | ఉదయరవిచంద్రిక | 20వ ,, | వజ్రకాంతి |
| 9వ ,, | షణ్ముఖప్రియ | 21వ ,, | బారుకేశి |
| 10వ ,, | గౌరీమనోహరి | 22వ ,, | సింధుమంధారి |
| 11వ ,, | మోహన | 23వ ,, | ధన్యాసి |
| 12వ ,, | వకుళాభరణం | 24వ ,, | నారాయణదేశాక్షి |



ఓం వాసుదేవాయ నమః శ్రీకృష్ణాయ నమః

# ఆంధ్ర గీత గోవిందము

## ప్రథమ సర్గము

ఉ॥ శ్రీ లలనాతనూభవ శి - లీముఖ భీకర కీలికీలలన్
జాలఁ గలంగి, చేరయము - నాపులినస్థలిఁ రాధికోపరిన్
హోళిగ కేళిదేలి, కల - శాబ్ధిని నీలపయోద మాలికా
లీల వెలుంగు మాధవుడు - శ్రీల నొసంగుత భక్తకోటికిన్॥ 1

శిలీముఖ = బాణము; హోళిగ = సంతోషముగ.

తా॥ మన్మథ బాణాగ్నిజ్వాలలకు తాళజాలక యమునానది దరికిఁ జేరిన రాధతో మాధవుడు సంతోషముగ కేళిదేలువేళ పాలసంద్రముపై అందాల నీలిమేఘమో యన నొప్పెడు శ్రీకృష్ణపరమాత్ముడు భక్తుల కనురక్తితో అనేక సంపదల నిచ్చుగాక.

ఉ॥ నీలతమాలకాననము - నీరదమేదురమై వినీలమై
క్రాలెను, పిడె రేపిటికి; - రాధ! గృహస్థునిజేయుమన్న నం
దాలపనంబులన్ గదలె - నా తులసీ వనమధ్యమున్ రహః
కేళులుసల్ప రాధికయు-కృష్ణుడునవ్వి జయమ్ములయ్యెడిన్ 2

తమాల = కానుగుచెట్లు; నీరదమేదురమై = మేఘములచే దట్టమై;
గృహస్థుని = (1) గృహములోనున్నవానిగా, (2) ఒక ఇంటివానిగ
అన్న = (1) సోదరుడైన, (2) అని పలికిన
నందాలపనంబులు=(1) నందునిమాటలు (2) ఆనందకరమైన మాటలు

తా॥ "ఓ రాధా! ఆకాశమున మేఘములు దట్టముగా బట్టినవి. అరణ్య భూములు చీకటి కానుగుచెట్లచే గాఢాంధకారముగా నున్నవి. రాత్రు లందు భయపడు కృష్ణుని నీవే యింటికి జేర్చుము" అని నందుడు పల్కగాఁ గదలిపోవుచు బృందావనమున విహరించుచున్న శ్రీ రాధా కృష్ణుల రహస్యక్రీడలు సర్వోత్కృష్టములైనవి.

వి॥ "గృహస్థుని జేయుము" అనగా రాధా! నీకారణముననే కృష్ణుడు గృహస్థుడైనాడు. భార్యవై అభ్యుదయమొనరింపుమని ఆనందముగా నందుని వాక్కులు వెలువడినవని అంతరార్థము.

కం॥ శ్రీ రాధా మాధవ శృం
గార కథాసంయుతమగు – కావ్యంబును, సొం
పార జయదేవ యతిచే
పూరింపంబడె, నుతింప – బుధజనులెల్లన్. 3

తా॥ శ్రీ రాధా మాధవ ప్రణయగాథ కల్గిన కావ్యమును సొంపుగా యతి సదృశుడైన శ్రీ జయదేవునిచే పండిత ప్రకాండులు వినుతింపగా పూర్తిగా నెరవేర్పబడినది.

వి॥ సంస్కృతమున శ్రీ జయదేవుని చేతను తెనుగుబాసన య. తి. అనగా శ్రీమాన్ యల్లకరి తిరువేంగళసూరి చేతను రచింపబడినదని భావము.

గీ॥ హృదయమే వేళ శ్రీకృష్ణ – పదములందు
భక్తిరసమున స్వచ్ఛమై – పరగునపుడు,
సుకవి జయదేవ యత్యుక్త – సుభగ గాన
మధురభారతి వినరయ్య – మనము లలర. 4

తా॥ సజ్జనులారా! శ్రీహరి చరణములను ధ్యానించుటలో అభిలాష గలదేని, శృంగార కళయందనురాగము గలదేని, సుకవిచంద్రులైన యతిశ్రీ జయదేవులచే విరచింపబడిన అమృతమాధురీ సదృశములైన సంగీత కళా మిశితములైన శ్రీసూక్తుల నాలకింపుడు.

గీ॥ పద్మినీవధూ చుంబిత - పద్మముఖుడు,
హరిత శుకకాంతి కుండల - ధరుడు, మౌలి
కా ధరుండు, మాళవరాగ - భూధవుండు,
తోషిత స్వాంతుడగుచు ప్ర - దోషమందు,
జేరె సంగీతశాలను - చెన్ను మీర.

ప్రదోషము = సాయంసంధ్య, మునిమాపు.

తా॥ పద్మినీజాతి స్త్రీలచే చుంబించబడిన మోముగలవాడును, పచ్చని కుండలములు ధరించినవాడును మౌక్తికహారములను ధరించినవాడును నగు మాళవరాగమను రాజు సాయంత్రపువేళ సంతోషితస్వాంతుడై సంగీతశాలను ప్రవేశించెను.

వి॥ నితంబినీమణులు ఆలాపించు మాళవరాగము పురుషరాగమై సకల రాగములకు రాజై యున్నందున అష్టపదులకు ప్రథమముగ ప్రయోగింపబడినది.

అవతారిక :- "పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే" అను భగవానుని వాక్యము రీతి భూమిపై నవతరించిన దివ్యావతారములలో జగత్ప్రసిద్ధములైన దశావతారములను అందరికి నానంద మొనరించునని గ్రంథము నిర్విఘ్నముగా పరిసమాప్తమగునని ప్రప్రథమమున స్తుతింపబడినవి.

## 1వ అష్టపది

1) ప్రలయపయోధి జలమ్ముల ప్రాబలుకుల నావవోలె
వసుధకు గొనివచ్చిన కేశవా! ధృతమీన శరీర!
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే॥

2) మునుగనీక మున్నీటి నీటిలో పృథుతరమౌ నీ పృష్ఠభాగమున
మందరమును మోసిన కేశవా! ధృత కచ్ఛపరూప!
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయజగదీశ హరే॥

3) చంద్రకళంకము విధమున తెల్లని నీపలుగోర కొమ్మున
ధరణిచక్రమును ధారణజేసిన కేశవా! ధృత సూకరరూప!
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే!

4) అమలకమలకరనఖరాగ్రమ్ముల కనకకశిపుఘనకళేబరమ్మును
భృంగముగా నొనరించిన కేశవా! ధృత నరహరిరూప!
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే॥

5) నీపదనీరజ దివ్యయుగళమున్ నిర్మలపానీయంబుల గడిగిన
బలిని రసాతలమున ద్రొక్కిన కేశవా! ధృత వామనరూప
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే॥

6) క్షత్రియ రుధిరాంబువులతో పాపములను నెడబాపుచు భవ
తాపములను శమియించిన కేశవా! ధృత భృగుపతిరూప!
జయ జగదీశహరే! హరే కృష్ణ! జయ జగదీశ హరే॥

7) రణమున దశముఖ నిధనముజేసి, పదితలలను నింద్రాదిసురులకు
బలిదానము గావించిన కేశవా! ధృత రఘుపతిరూప!
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే!

8) హలహతి భీతిలు యమునావిధమున, జలదనీలచేలంబులను
ధవళగాత్రమునధరణముజేసిన కేశవా! ధృతహలధరరూప!
జయ జగదీశహరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే!

9) యజ్ఞకర్మములందు పశుబలివిధియను వేదములహాహాభళిరేయనుచును
నిందజేసిన సమంత భద్రా కేశవా! ధృత బుద్ధశరీర !
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయజగదీశ హరే॥

10) దుష్టుల నీచుల పీచమడంపగ తోకచుక్కవలె కరవాలమ్మును
కరకమలమునందాల్చెదు కేశవా! ధృత కల్కిశరీర!
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే॥

11) శ్రీయతిజయదేవస్తుతగీతం శ్రుణురే శుభదం సుఖదముదారం
భవ్యం దివ్యం భవభయహరణం కేశవా! ధృత దశవిధరూప !
జయ జగదీశ హరే! హరేకృష్ణ! జయ జగదీశ హరే !

తా॥ 1) ప్రలయకాలమునందు సముద్రములేడు నొక్కటికాగా, జలమయ
మగు ప్రపంచమునందు, వేదములు మునిగిపోకుండునట్లు మత్స్యావ
తారమునెత్తి, యోడవలెనయి, ఆవేదముల నుద్ధరించితివి. ఓ కృష్ణా!
లోకేశ్వరా ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము.

2) ఈభూమినంతయు నీవు కాయలుగాయ మోసితివి. మందరపర్వతమును
సముద్రములో మునిగిపోకుండ మోసి, లోకమును రక్షించితివి.
ఓ కృష్ణా ! జగదీశ్వరా ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము.

3) నీవు వరాహావతారమునెత్తి నిర్మలమగు కోఱచే భూమినెత్తగా, అది
బాలచంద్రునియందు కళంకమువలె నీకోఱయందు మిక్కిలి ప్రకాశించు
చున్నది. ఓ కృష్ణా ! లోకేశా ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము.

4) నీవు నృసింహావతారమెత్తి, తామరపూవువంటి చేతిగోటికొనలచేహిరణ్య
కశిపుని శరీరమును తుమ్మెదను విచిత్రముగా జీల్చివైచితివి. ఓ కృష్ణా !
పరమేశ్వరా ! నీవు సర్వోత్కృష్టుడవై యుండుము.

5) నీవు అద్భుతమగు వామనావతారమెత్తి బ్రహ్మచారివై, బలిచక్రవర్తి
వలన మూడు అడుగుల నేలను యాచించి, యామేర అడుగులతో
గొలుచునపుడు త్రివిక్రముడవై ముల్లోకములను వ్యాపించి బలిని మోస
గించి నీకాలిగోటినుండి పుట్టిన గంగానదిని భూమిపై ప్రవహింపజేసి
దానిలో స్నానముజేయువారు పవిత్రులగునట్లనుగ్రహించితివి.

[వామనుడు త్రివిక్రముడై యొక్కపాదము నాకాశముపైకెత్తినపుడు సత్యలోకమున బ్రహ్మ, తండ్రిపాదమును గౌరవమున నభిషేకము జేయగా, ఆయభిషేకోదకమే గంగ యయ్యెనని పురాణప్రసిద్ధము.

6) నీవు పరశురామావతారమెత్తి, ఇరువదియొక్కమారులు క్షత్రియులను సంహరించి, వారిరక్తముచే కురుక్షేత్రమున శమంతకపంచకమను పేరుగల అయిదు నెత్తుటిచెఱువులను గల్పించి, అందు స్నానమొనర్చు వారు పాపములను సంసారతాపములను బాపుకొని, సౌఖ్యములనొందు లాగున కరుణించితివి. [నేటికిని 5 చెఱువులున్నవి.]

7) నీవు రఘువంశమున జన్మించి, రావణుని పదితలలను తెగనఱికి, పది దిక్కులందును పదుగురు దిక్పాలురకు బలిదానముజేసి ప్రీతి గూర్చితివి. ఓ కృష్ణా ! సర్వోత్కృష్టుడవగుము.

8) "రామో రామశ్చ కృష్ణః" అను ప్రమాణమును బట్టి కృష్ణావతారము వర్ణింపదగియున్నను, "వనజౌ వనజౌ ఖర్వః త్రిరామీ సతపోఽ తపః" అను ప్రమాణమురీతి బలరామావతారమును వర్ణించుచున్నాడు. నీవు బలరామావతారమెత్తి నిర్మలమగు దివ్యశరీరమునందు నాగేటి దెబ్బకు భయమంది యేతెంచిన యమునానదియోయన, మేఘమువలె నల్లనగు వలువలను ధరించియున్నావు. ఓకృష్ణా నీవుసర్వోత్కృష్టుడవై యుండుము.

[పూర్వము బలరాముడు కల్లుద్రాగి దేహము దెలియక బృందావన మందు గోపికలతో విహరించు తనతో, జలక్రీడసేయ రాలేదని యమునా నదిని కోపించి, నాగేటిచే బలాత్కారముగా నీడ్చెనని పురాణ ప్రసిద్ధము.]

9) నీవు కలియుగ రాక్షసులను మోసముచేయనెంచి, బుద్ధావతారమునెత్తి, యజ్ఞమను మిషచే పశుహింసను జేయువారిని గురించి "జనులారా! వేదములు ప్రమాణములు గావు. నిరపరాధములగు పశువులను వ్యర్థముగ జంపవలయునని చెప్పుచున్నవి. ఇట్టిఅన్యాయ మెచ్చటనైన

గలదా" యని వేదముల నిందించి పలువిధములబోధించి "అహింసయే పరమధర్మ" మని శాసించితివి. ఓ శ్రీకృష్ణా! నీవు సర్వోత్కృష్టుడవై యున్నావు.

10) కలియుగాంతమునందు మ్లేచ్ఛులు ప్రబలి, లోకమునకు బాధగలిగింపగా వారినందఱ జంపుటకై తోకచుక్కవంటి ఖడ్గమును ధరించి యవతరించెదవు.

[తోకచుక్కను జూచిన జనులకాపదలు మూడునట్లు దుర్మార్గులకు చావు మూడుననుట.]

11) యతిశ్రీ జయదేవులు సంస్తుతించిన గీతమును వినినచో, శుభములును సుఖములను చేకూర్చును. దివ్యమైన భగవంతుని కీర్తన గాన భవ భయంబులను పారద్రోలును. దశావతారములనెత్తిన ఓ కృష్ణా! లోకనాథా! హరీ! నీవు సర్వోత్కృష్టుడవై యున్నావు.

అవ॥ వేర్వేరుగ వర్ణించిన శ్రీకృష్ణుని దశావతారములను సంగ్రహముగా జెప్పుచున్నాడు.

చం॥ నిగమములుద్ధరించి, ధర - ణీధరమున్ ధరియించి, ధారుణిన్
దగ పునరుద్ధరించి, నఖ - దంష్ట్రిల దానవనాథుజీల్చి, సొం
పుగబలినొంచి హైహయుల-పొంకమడంచి, దశాస్యుద్రుంచి, చ
క్కగహలియై, జినుండునయి,-కల్కిగనౌ, దశవేషమ్రొక్కెదన్ 6

నిగమములు = వేదములు; నఖ = గోరు; దంష్ట్ర = కోఱ;
దశాస్యుడు = రావణుడు; జినుండు = బుద్ధుడు.

తా॥ వేదముల నుద్ధరించి కొండను మోసి, భూమండలమును పైకెత్తి, హిరణ్యకశిపును బరిమార్చి, బలిని పాతాళమునకు ద్రొక్కి, దురిత క్షత్రియులను జంపి, రావణుని ద్రుంచి, నాగేటిని ధరించి, అహింసను బోధించి బుద్ధుడై, కలికియవతారమును ధరింపగానున్న దశావతారముల నెత్తిన కృష్ణునికి నమస్కారము.

అవ॥ శ్రీకృష్ణుని స్వరూప రూపగుణ విభూతుల నిరూపించుచున్నాడు.

# 2వ అష్టపది

1) శ్రీరమణీ స్తనమండల - భృతకుండల - చలితలలిత వనమాలీ॥

ప॥ జయజయదేవహరే - హరేకృష్ణ జయజయదేవ హరే.

2) ఖరకరమండల మండన - భవఖండన- యతిజన
మానసహంస ॥ జయ ॥

3) కాళియపన్నగ భంజన - మునిరంజన - యదుకుల
కమలాదిత్యా ॥ జయ ॥

4) మధుముర నరకనిషూదన - కలిభేదన - సురనరమోద
నిధాన ॥ జయ ॥

5) అమల కమలదళలోచన - అఘమోచన - త్రిభువన
భవననిధాన ॥జయ॥

6) ధరణీజాకుచభూషణ - ఘనతోషణ - కదనశమిత
దశకంఠ ॥జయ॥

7) ధర్మాధర్మ విచక్షణ - సురరక్షణ - శ్రీముఖ
చంద్ర చకోర ॥జయ॥

8) యతి జయదేవ కవేరిదం - కురుతేముదం -
ఉజ్వల మంగళగీతం ॥జయ॥

తా॥ శ్రీదేవి కుచాలింగన తత్పరుండవై, చెవుల దివ్యకుండలములను, వక్షస్థళమున వ్రేలాడు మనోహరమగు వనమాలను ధరించి, మిగుల నానందము ననుభవించు శ్రీకృష్ణునకు మంగళము.

2) సూర్యమండలాంతర్గతుడవై, భవబాధలను తొలగించి, మానస సరస్సునందు హంసవలె, మునుల మానసములందు హంసవై విహరించుచు, భక్తులను రక్షించు స్వామీ నీకు మంగళము.

3) కాళియుడను సర్పరాజును జయించినవాడా ! మునిజనములను నానంద మొనర్చువాడా ! యదుకులమను కమలమునకు సూర్యునివలె నాహ్లాదము గూర్చువాడా నీకు మంగళము.

4) మధు మురు నరకాది రాక్షసులను సంహరించినవాడా ! కలిపాపములను పోగొట్టువాడా ! సురలను నరులను సంతోషింప జేయువాడా! ఓ శ్రీకృష్ణా ! నీకు మంగళము.

5) పుండరీకములను బోలు నేత్రములుగల స్వామీ ! ఓ పాపవిమోచనుడా! ముల్లోకములకు నాధారమైనవాడా ! ఓ కృష్ణా ! నీకు మంగళము.

6) రామావతారమున సీతాదేవికి అత్యంత ప్రీతుడవై అమితానందముజెంది దశకంఠుని బరిమార్చి, నిత్యానందముతో నుండు శ్రీకృష్ణా ! నీకు మంగళము.

7) ధర్మాధర్మములను పరిశీలించుచు, దేవతలను రక్షించుచు, లక్ష్మీదేవికి సంతోషము గలిగించు స్వామీ ! శ్రీకృష్ణా నీకు మంగళము.

8) శ్రీయతి జయదేవులచే పలికిన యీ గీతము ఎల్లవేళల ఆనందము గలిగించుచూ ప్రకాశించుగాక.

అవ॥ శ్రీకృష్ణుని విలాసక్రీడలకు నిదానమగు వసంతమును వర్ణింపబోవుచు ఆశీర్వచన మంగళము నాచరించి భక్తుల నానందింపజేయుచున్నాడు.

గీ॥ శ్రీ పయోధర ద్వంద్వ సం – శ్లేషలగ్న
కుంకుమాంకిత సంకుల – పంకిలంబు;
స్మరసమాఘాత పూరిత – శ్రమజలంబు;
కృష్ణ వక్షస్థలంబు ర – క్షించుగాత. 7

స్మర = మన్మథ; సమాఘాత = యుద్ధము; శ్రమజలంబు = చెమట.

తా॥ శ్రీదేవి చనుదోయిని గౌగిలించుటచే నంటిన కుంకుమతో నలరారు నదియు, మన్మథక్రీడలచే చెమటబిందువులు తాండవమాడ ప్రకాశించు శ్రీకృష్ణుని వక్షస్థలము, అందఱిని రక్షించుగాక.

అవ॥ సంభోగ శృంగారమును సాకారముగా ప్రకాశింపజేయునది విప్రలంబ శృంగారముగాన, తొలుత శ్రీకృష్ణుని విరహముచే సంతప్తచిత్తయైన రాధ వృత్తాంతమును ప్రస్తావించుచున్నాడు.

గీ॥ మాధవ వసుధాధవ వల - ద్బాధను, రతి
నాథ గాథను, క్ష్మాధవా - రాధను, యదు
వంశ సోమ సంశోధను - వర్ధమాన
నిరపరాధను, రాధను - నెలత బలికె. 8

మాధవ = వసంతుడు; వలత్ = వృద్ధినొందుచున్న;
గాథ = 1) చరిత్ర 2) గీతము; వర్ధమాన = విష్ణువు.

తా॥ శ్రీకృష్ణుడు దగ్గఱలేనందున వసంతునిచే వృద్ధినొందించుచున్న బాధ గలిగినదియు, మన్మథగీతముల నాలపించునదియు, మాధవుని ఆరాధించునదియును, కృష్ణుని బృందావనమున వెతకివేసారునదియు, కృష్ణుని యందు నేలాటిదోషము లేనట్టిదియునగు రాధతో వీనులవిందగునట్లు చెలికత్తియ యీలాగున బలికెను.

వి॥ కారము దినినఁబిదప తీపిగుణము చక్కగ దెలియును. వియోగము సంభవించిన పిదప సంయోగముయొక్క గుణము చక్కగ నెఱుగ బడునని మొదట విప్రలంబ శృంగారము చెప్పబడినది. పెక్కురు ప్రియురాండ్రయందనురాగము గలవాడు దక్షిణుడను నాయకుడు. నాయకుడు సమీపమునకు రాలేదని వ్యాకులత నొందినది విరహోత్కంఠిత నాయిక.

అవ॥ మన్మథబాధచే పీడితయైన రాధ నోదార్పదలచి శ్రీకృష్ణుని విహారముల నెల్ల వర్ణింపుచు అతని సన్నిధానమునకేగుమని ప్రేరేపించు చెలివాక్యములు వివరించుచున్నాడు.

# 3వ అష్టపది

ప॥ విరహి మహీజన దురంతమైన సరసవసంతంలో సఖులతో
విహారిస్తున్నాడే – శ్రీహరి – విహారిస్తున్నాడే॥

1) లలితలవంగపు లతలనంటిన – కోమలమలయ సమీరంలో,
కోయిల పాటల ఝుమ్మను తేటుల – కులికే
కుంజకుటీరంలో ॥విహా॥

2) మదనుని కోర్కెల మత్తిలుమగువలు – చేసే దీనాలాపంలో
పువ్వుల సొంపుల తుమ్మెదగుంపుల పొగడల నీడల
తాపంలో ॥విహా॥

3) కాముని బంగరు కామరంగుగల – కేసర కుసుమ వికాసంలో
కలివెతూణముల అలులబాణముల – సరస వసంత
విలాసంలో ॥విహా॥

4) కస్తురివాసన క్రమ్మిన చివురుల – జానగు కానుగ జొంపంలో
ఎదలను జీల్చే ఎఱ్ఱనికాంతుల – మోదుగపూవుల
గుంపులలో ॥విహా॥

5) సిబ్బితితొలగిన గుబ్బెతగాంచిన–కరుణవిరుల చిఱునగవులలో,
ఎడసినవారల యెడదల బొడిచెడు – మొగిళుల బాకుల
ఎగవులలో ॥విహా॥

6) గురువిందవిరుల ఘుమఘుమతావుల–మొల్లలపువ్వులగంధంలో
మునులనుసైతము మోహింపజేసే – సొబగౌ
తొలికారందంలో ॥విహా॥

7) మాధవితీవెలు మరగినమావుల – మొగ్గల పులకల గోములలో,
యమునాజలముల పావనమౌ బృందావన కానన
భూములలో ॥విహ॥

8) యతి జయదేవుల గతియగు శ్రీహరి – చరణస్మరణవర్ణనలో,
శృంగారరసము పొంగులువారిన – మోహన
నవ్యవసంతంలో ॥విహ॥

తా॥ ప॥ చెలీ ! రాధా ! విరహిజనులకు విదారుణమైన వసంతసమయంలో బృందావనములో శ్రీకృష్ణుడు సఖీజనములతో ఆడుచూ పాడుచూ విలాసముగా విహరిస్తున్నాడు.

1) మెత్తని లవంగపు తీగలపైనుండి చల్లని పిల్లగాలులు మెల్లగా వీచు చున్నవి. కోయిలల కుహూకుహూరావములు తుమ్మెదల ఝుంకార నాదములు పొదరిండ్లను ప్రతిధ్వనింపజేయుచున్నవి. అట్టి వసంత ములో శ్రీకృష్ణుడు విహరిస్తున్నాడు.

2) దేశాంతరగతులగు విరహిజనుల ప్రియురాండ్ర హృదయములలో కామము వృద్ధిబెందుచుండగా, యౌవనులైన గోపికలు మదనోన్మాద ముతో "కృష్ణా ! కృష్ణా !" యని దీనముగా బిలుచుచూ, బృందా వనమునకు పరుగెత్తి రాగా జుమ్ము నగ్రమ్మియుండు తుమ్మెదలుగల, పూలగుత్తులుగల, పొగడచెట్లక్రింద శ్రీకృష్ణుడు విహరిస్తున్నాడు,

3) మన్మథుడను మహారాజు ధరించిన బంగారు గొడుగువలె నాగకేసర పుష్పములు చక్కగా వికసించినవి. కుప్పలు కుప్పలుగా రాలిపడిన కలిచె పువ్వులపై తుమ్మెదలు వ్రాలుటయు లేచిపోవుటయు జరుగు చున్నందున వియోగులపై ప్రయోగింపబడిన మన్మథబాణములా యని తలపింప జేయుచున్నవి. [కలిచె పూవులు అమ్ముల పొదులుగను తుమ్మెదలు బాణములుగను వర్ణింపబడినవి.] అట్టి వసంతములో కృష్ణుడు గోపికలతో విహరిస్తున్నాడు.

4) కస్తూరి మృగములు కానుగుచెట్లను రుద్దుకొనిపోగా, ఆ కస్తూరివాసన కానుగుచెట్ల ఆకులనంతయు వ్యాపించి పరిమళించుచుండగా, విరహుల హృదయములన్నియు వ్రేగుచుండగ, హృదయవిదారములై మోదుగ పూవులు ఎఱ్ఱనికాంతులతో ప్రకాశింపగా శ్రీకృష్ణుడు గోపికలతో విహరిస్తున్నాడు.

5) కరుణవృక్షములెంత చక్కగా పూచియున్నవని, యొడలు తెలియక, పైట జారునదియు తెలియక, ఆపూలసోయగమును చూచు, ఒక గోపికను జూచి "సిగ్గుతెలియటంలేదా నీకు" యని పరిహసించుసట్లు కరుణపూవులు పూచినవి. వియోగిజనముల హృదయములలో పొడుచు టకు మన్మథుడేర్పరచుకున్న బాకులోయనగ మొగలిరేకులు గాలికి యెగసి యెగసి పడుచున్నవి. అట్టి వసంతములో కృష్ణుడు విహరిస్తున్నాడు.

6) బండి గురివెంపపూవులు మొల్లలు వికసించి, పరిమళమును దిక్కుల వెదజల్లుచుండగా, మౌనంగా ముక్కులు చేతబట్టుకొని తపమొనరించు కొను మునులకుసైతము, ఆకర్షింపజేయుచున్నదా దృశ్యము. అట్టి రమణీయ వసంతములో గోపవధువులతో కృష్ణుడు విహరిస్తున్నాడు.

7) కోమలములైన మాధవీలతలు మామిడి చెట్లను పెనవేసుకున్నవి మామిళ్లు మొగ్గ తొడిగినవి. యమునా జలముచే పవిత్రమైన బృందా వనములో కృష్ణుడు గోపికలతో విహరిస్తున్నాడు.

వి॥ ఇచ్చట మాధవీలతలు స్త్రీలు - మామిడిచెట్లు పురుషులు - మామిడి మొగ్గలు గగుర్పాటు - వసంతమహిమచే అచేతనములగు మాధవీలతలు మరగి మామిళ్లను పెనవేసుకొని కౌగిళింతలు గగుర్పాట్లను మన్మథ వికారముల ననుభవించుచుండ నిక సచేతసుల విషయము మఱి చెప్ప పని యేమున్నది యనుట –

8) శ్రీ యతి జయదేవుల దిక్కైన శ్రీహరి చరణ కమల స్మరణలచే

నలరారు నవవసంతసమయంలో, బృందావనములో జరుగు శృంగార విలాసముల వర్ణించు ఈ గీతము పరమోత్కృష్టమైనది.

అవ॥ విప్రలంబ శృంగారమునకు విభావమును వర్ణించి ప్రసంగ వశమున విరహిజనులను బాధించు వసంతకాల వాయువును వర్ణించుచున్నాడు -

ఉ॥ గేదగి గంధబంధువన, – గింగిరి విచ్చిన మల్లెపువ్వులా
మోదము, వన్యభాగముల – ముద్దులుగొల్పుచు ఈరువారుచున్,
శ్రీదయితాకుమారమని – జీవసమీరము నాబరంగి, యౌ
రా దహియించు చిత్తముల–నాపవనమ్ము వసంతవేళలన్. 9

గేదగి = పచ్చ పూమొగలి; ఈరువారుచు = విహరించుచు
జీవసమీరము = ప్రాణవాయువు.

తా॥ వసంతకాలమునందు అరవిరిసిన మల్లెపూల బుక్కాములను మొగలి రేకుల తావులను దిక్కులను వెదజల్లి పరిమళింపజేయుచు మన్మథుని ప్రాణవాయువువలెనున్న మలయమారుతము విరహిజనుల హృదయములను గాల్చుచున్నది గదా !

అవ॥ ఇక వసంతకాల దివసములు విరహి జనమునకు మిక్కిలి బాధాకరములని వర్ణింపుచున్నాడు,

చం॥ విరిసిన తేనెవాసనల – వెజ్జుల నెత్తిన తేంట్లుతాకిడిన్,
మురిసిన మావితేనెల – నూల్కొను కోయిల తీయపాటలన్,
కరముతపించి, పాంథులున్వ – కాంతలపొందునుబొందినట్లుగా,
స్మరణముజేసి యెట్టులో వ–సంతము నెట్టగ సాగిరక్కటా ! 10

తా॥ వసంతకాలమునఁ జిగిర్చిన మామిడిచెట్లయందలి మకరందమును ద్రావి మత్తిలి జుమ్మున గ్రమ్ముచుండు తుమ్మెదలు చిగుల్ల నల్లలనాడింపగా నందు విహరించు కోయిలలు తీయగ పాడుచుండగా, విరహిజనులకు సంతాపము గలిగింపగా, దమ ప్రియురాండ్ర దలంచి స్వప్నమునందు

వలెనే ధ్యానముచేత ప్రియాసంగమము గలిగినట్లు దోపగ నాలింగనములు మున్న గుభావముల నించుక ననుభవించుచు, నెట్లెట్లో యీవసంత కాల దినములు ప్రియురాలి విరహముచే గలుగు బాధకన్న మిక్కిలి బాధను గలుగజేయుచున్నవని భావము.

గీ॥ సకియ, రాధికారమణితో – సరసనెదుట.
పెక్కురింతుల కౌగిళ్ళ – ప్రీతిచేత
తొట్రిలంబడి కొమరొప్ప – తోయజాక్షు
కృష్ణు వీక్షించి, వెండియు – నిట్టులనియె. 11

తా॥ ఆ చెలికత్తె యించుక దూరమున ననేకస్త్రీలతో గూడి ఆలింగనాది శృంగార విలాసముల ననుభవించు శ్రీకృష్ణుని జూపుచు రాధికతో నిట్లు చెప్పదొడంగెను.

అవ॥ ఆ సఖి వాక్యములను గీత రూపమున జెప్పుచున్నాడు.

# 4వ అష్టపది

పల్లవి ॥ చెలియా ! రాధా ! చెలుల కేళిలో
అలరుచునున్నాడే – శ్రీహరి – అలరుచునున్నాడే !

1) గంధముబూసిన నల్లనిమేనున – పసుపువలువ తోమాలలతో
క్రీడలకదలే కుండలకాంతులు – చెక్కుల తళతళలాడంగా ॥అల॥

2) పంచమరాగము పలికే కృష్ణుని – బిగికౌగిలిలో జేర్చి
గుబ్బలు జిల్లన గోపికయొకతుక – తోడుగ పాడగసాగే ॥అల॥

3) మన్మథ లీలల మోహన కృష్ణుడు – మనమలరగ కనుగిట
ముఖకమలమ్మును ముగుద యొకర్తుక – తద్దయు
తలుపగ సాగే ॥అల॥

4) చెవిలో సుద్దులుచెప్పెడు విధమున - చెక్కిలిచెక్కిలి జేర్చి
వద్దనుజేరును ముద్దుల కృష్ణుని - ముద్దియ ముద్దిడసాగే ॥అల॥

5) యమునా తీరాశోకవనమ్మున - చెన్నగు వెన్నుని జూచి
మదనునికోరిక యెదలోమెదలగ - మదవతి వలువనులాగే ॥అల॥

6) కరతాళమ్ముల కరకంకణములు - మురళికి సరిగా మ్రోగా
రాసలీలలో నాట్యముజేసే - రమణిని హరి కొనియాడే ॥అల॥

7) ఒకతెను కౌగిట ఒకతెనుముద్దుల- ఒకతెను రతిలో దేల్చి
మరియొకతరుణిని నవ్వులముంచి - వేరొకవెలదిని వెంటాడే ॥అల॥

8) యతి జయదేవ స్తుతియగు బృందా - వన హరి కేళి రహస్యం
దివ్యశుభమ్ములు భవ్యవిభవములు -భువిలో గూర్చునుగాక ॥అల॥

తా॥ పల్లవి॥ చెలీ రాధా! చూడవే; విలాసవతులు ముగ్ధలునగు ప్రియురాండ్ర గుంపులో శ్రీకృష్ణుడు ఎలా విలాసముగా నున్నాడో!

1) శ్రీకృష్ణుడు తన నల్లని దేహమునందు చందనమలందికొని, పీతాంబరము లను వనమాలను ధరించి, గోపవధూ క్రీడలయందలి సంభ్రమమువలన చెవులనుండు మణికుండలములు గండస్థలముల తళతళకాంతులు విర జిమ్ముచుండగా, విలాసముగా నున్నాడు.

2) ఒక గొల్లభామ మోహమును బట్టజాలక మిక్కిలి బటువుగల తన పాలిండ్ల యుబ్బులాటము దీఱునట్లు శ్రీకృష్ణుని గట్టిగా కౌగిలించుకొని, యతని వేణునాదమునందు శ్రుతిని గలుపుచు పంచమ స్వరమున కంఠమెత్తి మనోహరముగా నాలాపము జేయుచున్నది.

3) ఒక గొల్లపిల్ల హావభావాది శృంగార విలాసములయందు కనులను మనోజ్ఞముగా ద్రిప్పుచు, హఠాత్తుగా మన్మథుని జనింపజేయు శ్రీకృష్ణుని ముఖారవిందమును జూచుచు నట్టె నిలచి, యా సౌందర్యము

నకు నాశ్చర్యము జెంది, నిశ్చేష్టయై యాతని ముఖకమలమునే ధ్యానించుచున్నది. చూచితివా రాధా !

4) అదిగో ! ఇంకొక యువతి మోహమునాపజాలక, తనంతట ప్రియుని ముద్దు పెట్టుకొనినచో సిగ్గులేనిదని సాటివారు నవ్వెదరని యాలోచించి, తన పెద్దపిఱుదలు గదిలించుకొనుచు విలాసముగా కృష్ణుని చెవిలో నేమో రహస్యము చెప్పులాగున, చెక్కిలి దగ్గఱ ముఖమును జేర్చి యాముఖము దగులుటచే గగుర్పాటు నొందిన శ్రీకృష్ణుని చెక్కిలిని నొక్కి చక్కగా ముద్దాడుచున్నది.

5) రాధా ! చూడుము. ఒక గొల్లపిల్ల యమునానది యందు జలక్రీడ సేయ వేడుక గలిగి యందమగు ప్రబ్బలిపొదయందు విహరించు శ్రీకృష్ణుని దుకూలమును జేతితోఁబట్టికొని నవ్వుచు లాగుచున్నది.

6) రాస క్రీడలో కృష్ణునివెంట నాట్యము జేయుచు పాటకు తగినట్లు చేతుల గాజులు గల్లుగల్లుమని మ్రోగునట్లు ఒక గొల్లభామ తాళము వేయుచుండగా శ్రీకృష్ణుడు భళా యని పొగడుచున్నాడు

7) శ్రీకృష్ణుడొక కోమలిని కౌగిలించి యొకయువతి చెక్కిలి నొక్కి ముద్దాడి యొక రమణితో రమించుచున్నాడు. నవ్వుచు చిత్రమైన ఒక విషయ మును జెప్పి యొక స్త్రీని నవ్వులలోముంచి, యొకతె ముందు చను చుండగా దానివెంటబడి పోవుచున్నాడు.

8) శ్రీ యతి జయదేవుల సూక్తులు పరమాత్ముడైన శ్రీకృష్ణుని యద్భుత క్రీడారహస్యమును తెలుపునవి గాన, వినువారికి పఠించువారికి అనేక సంపదలను సుఖములను ఇచ్చునుగాక.

అవ॥ ఆ చెలికత్తియ రాధను శ్రీకృష్ణుని సేవించుటకై ప్రేరేపింపదలచి, యతని శృంగారలీలల యతిశయమును దెలుపు మిషబూని, రాధతో నిట్లు బలుకుచున్నది.

ఉ॥ హావడి మాన్పి లోకులకు - హర్షము సౌఖ్యము గల్గజేసి, యిం
దీవర కాంతివంతమగు - దేహమునన్ మదనోత్సవంబులున్
బావనులైన స్త్రీల కన - యమ్మును గల్గ, గవుంగలింప స
ర్వావయవమ్ములన్, హరియు-హాయిగ బాడగసాగె నామనిన్॥ 12

హావడి = ఉపద్రవము.

తా॥ ఈ వసంతఋతువునందు లోకులకు దుఃఖములను బాపి సౌఖ్యములను గూర్చుచు నల్లగలువల నుల్లసంబాడు నల్లని కోమలాంగకముల మదనోత్సవములను బొదలజేయుచు నుల్లముల నుల్లాసము పల్లవింప గొల్లపడచులు ఉల్లంబులతోడను బాహ్యావయవములతోడను బాగుగా కౌగిలింప శ్రీకృష్ణుడు హాయిగా తీయగా మురళీగానము జేయుచున్నాడు చూడవే రాధా !

అవ॥ చెలికత్తె రాధను త్వరగా బృందావనమునకు బంపదలచి మలయ మారుతము మున్నగునవి దుస్సహములని నిరూపించుచున్నది.

గీ॥ పరిసరప్రాంత పన్నగ - వక్త్రికబళ
నోగ్రతాపంబు బాపంగ - నుత్సహించి,
మలయ పవనంబు తుహినాంబు - మగ్న వాంఛ,
హిమగిరీంద్రంబు చేరువ - కేగుచుండె. 13

తా॥ పాముల నోళ్ళ విషతాపమును సహింపలేక చల్లని మంచునీటిలో మునిగి పోగొట్టుకొనదలచి మలయమారుతములు వెడలి హిమవత్పర్వతము వైపుకు బోవుచున్నవి. [అనగా మలయపవనము దక్షిణదిశ నుండి ఉత్తరదిక్కునకు వీచుచున్నదనుట.]

గీ॥ విరహిజనుల వేధించు మా - వి చివురులను
గనుచు నలరి, కుహూకుహూ - ధ్వనుల విరహి
జన వధమ్మును జేసెడు - చంద్రుఁ గోకి
లములు బెదరింప, నది విచిత్రంబ కాదె? 14

కుహూ = 1) కోకిలధ్వని 2) అమావాస్య.

తా॥ విరహిజనముల మనముల కష్టపెట్టు లేమావి చిగుళ్ళను జూచి సంతో షించిన కోయిలలు ఆ విరహిజనుల కష్టపెట్టు చంద్రుని భయపెట్టు [కుహూ = అమావాస్య] కుహూ ధ్వనులను చేయుచున్నవి. విచిత్ర ముగా నున్నది కదూ.

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహాకావ్యమునందు ప్రథమ సర్గము.

# ద్వితీయ సర్గము

అవ॥ పూర్వ సర్గమునందు సఖి వాక్యములచే తెలివినొందిన రాధయొక్క అభిలాష చింతారూపములగు రెండవస్థలను వక్కాణించి, తనయెదుట నితరస్త్రీలతో విహరించు కృష్ణునిజూచి, యోర్వజాలక, యొక పొదరిల్లు జేరి రాధ యనుభవించు స్మరణ రూపమగుమన్మథదశను వివరించుటకై ద్వితీయసర్గము నారంభించుచున్నాడు.

మ॥ సరసీజాక్షుడు రాసకేళి, లవనిన్ – సాధారణప్రేమతో
చరియింపన్, తనగౌరవంబుడుగగా – సక్రోధయై సాశ్రుయై
తరుగుల్మాంతర గేహమందణగి, సం–తాపంబు దీపింప స
త్వరవాచాగతి చేటితోబలికె రా–ధాకాంత దీనాస్యయై॥ 15

సాధారణ = సమానమైన ఉడుగగా = తగ్గిపోగా

తా॥ శ్రీకృష్ణు డితరస్త్రీలయందును తనయందును సమానమైన ప్రేమతో విహరించుట జూచి తన యతిశయము తరిగిపోయినందుకు నోర్వ జాలక ప్రణయకోపముతో కళ్ళనీళ్ళు రాలగా నొక పొదరింటిలో దాగి, చెలికత్తెతో రహస్యముగా దీనముగా త్వరత్వరగా నిట్లు పలుకసాగెను.

అవ॥ రాధ చెప్పిన మాటలను గీతరూపమున వివరించుచున్నాడు.

# 5వ అష్టపది

పల్లవి॥ రాసలీలలో రంజిలి నను పరిహాసముజేసిన ఆశ్రీహరినే
మఱువదు మఱువదు నామనసు – మఱువదు హరిని
నా మనసు॥

1) అదరెడు తీయనిపెదవుల మురళిని – మృదువుగ నూదెడువానిన్
వగగల కనుగవ తూగుకిరీటము – పూగెడు పోగుల
స్వామిన్ ॥మ॥

2) తిన్నని వన్నెల కన్నుల పింఛెము – గలిగిన సిగగలవానిన్
రంగుల హరివిల్లంగుల నల్లని – మేఘపు మెయిగల
స్వామిన్ ॥మ॥

3) జానగు గొల్లల చానల మోవుల – తేనెలు గ్రోలెడువానిన్
ఎఱుపగు చివురుల యొఱపగు వాతెఱ – పై చిఱునగవుల
స్వామిన్ ॥మ॥

4) పులకల గొల్లత మూకల కేలుల – కౌగిలి గలిగిన వానిన్
చై యెడదలగల తొడవుల చికిలుల – చీకటిజీల్చెడు
స్వామిన్ ॥మ॥

5) బంగరురతనపు పోగులతళుకులు – చెక్కులవెలిగెడు వానిన్
పచ్చని వలువలు మానిసి తపసుల – బలగము గలిగిన
స్వామిన్ ॥మ॥

6) కడపలనిలబడి కలియుగపాపపు – బీతును బాపెడు వానిన్
రవరవ వలపులు రగిలియు పెరుగగ – రంజిలజేసెడు
స్వామిన్ ॥మ॥

7) చందును గెలిచెడు గంధపు తిలకము-నుదుటను దనరెడువానిన్
బటువగుగుబ్బల కటువగు ఱొమ్మున - దిటవుగ జూచెడు
స్వామిన్ ॥మ॥

8) శ్రీ జయదేవ యతీంద్రులు బలికిన-చెన్నగు కన్నయ గీతం
అనయము పున్నెపు గొనముల మిన్నగు - జనులకు
పరమ పవిత్రం ॥మ॥

వగ = విలాసము! హరివిల్లు = ఇంద్రధనుస్సు; ఒఱపగు = సొబగగు
తొడవులు = భూషణములు; వికిలి = కాంతి; బటువగు = గుండ్రని
కటువు = 1) గట్టి 2) వాసనగలది.
కడపలు = 1) గడపలు 2) కడిమిచెట్లు (కదంబ వృక్షములు)
రవలు = 1) చిన్నవి 2) రత్నములు.

1 తా॥ చెలీ! కృష్ణుడు బృందావనమునందు గోపికలతో గూడి రాసక్రీడ సేయునప్పుడు, మోహనమను పిల్లనగ్రోవిని తనపెదవిపై నుంచుకొని, యమృతమువలె తియ్యనై వినసొంపైన సంగీతము నాలాపన జేయుచు, నొక కడగంట గోపికల జూచుచు, నా గీతమునందలి పారవశ్యము తెలియజేయుటకై తల యూచుచుండగా, కిరీటము కదలాడగా, బంగారు కుండలములు వూగుచూ తళతళకాంతులు ప్రసరించుచుండగా, యథేష్ట ముగా విహరించుచున్నాడు. ఆ కృష్ణునే నామనము స్మరించుచున్నది. అస్వామిని మఱువలేక పోవుచున్నాను.

2) నెమలిపురులచే మనోహరమగు నెమలిపింఛమును నల్లని వెంట్రుకలపై గుండ్రముగా జుట్టుకొని యున్నందున, ఇంద్రధనుస్సుచే కూడుకొన్న నల్లని మేఘమువలె నందమును జిందించు శ్రీకృష్ణుని మఱువలేకున్నాను.

3) గోపికల మోవితేనెలను గ్రోలుటలో మిగుల నాసక్తి గలవాడును, ఎఱ్ఱని చివురులవంటి యధరపల్లవము గలవాడును, చిఱునగవుతో నెంతయు ప్రకాశించువాడును నగు శ్రీకృష్ణుని మఱువజాలకున్నాను.

4) ఆనందవశమున పులకాంకితలగు గోపికలచే బాగుగా గౌగిలింపబడిన వాడును, కరములు పాదములు వక్షస్థలమునందు ధరించిన మణిమయ కాంచన భూషణముల కాంతులచే చీకటి బారద్రోలెడువాడు నగు శ్రీకృష్ణుని నాచిత్తము మఱవలేకున్నది,

5) రత్నమయములగు మకర కుండలములను, పట్టు పీతాంబరములను ధరించి, భీష్మాది నరులును నారదాది మహర్షులును దాసానుదాసులై సేవించుచుండ వెలుగొందు మనోహరుడగు శ్రీకృష్ణుని నా మనస్సు మఱువలేక పోవుచున్నది గదే.

6) నాకొఱకై సంకేతస్థానమగు కడపచెట్ల మొదళ్ళయందుండువాడును, కలికలుషమును నపహరించువాడును, నాలోని చిన్నవలపులు వృద్ధి జెంది నన్ను రమింపజేయువాడును నగు శ్రీకృష్ణుని మఱువ లేకున్నాను.

వి॥ ప్రతి యింటి గడపపై ఆస్వామి వెలసి కలి పాపములను బోగొట్టు వాడును; నా వలపులు అల్పములైనవి కావు. అనర్ఘములైన రత్నము లాంటివి, అట్టి వలపులతో నను రంజింపజేయు స్వామిని మఱువ లేకున్నాను.

7) మేఘముల నడుమ దిరుగాడు చంద్రునివలెనుండు చందన తిలకమును ముఖమందు ధరించినవాడును, గోపికల కఠినస్తనముల రాపిడి పలు మారు గలుగుటవలన గట్టిపారిన వక్షఃకవాటము గల్గువాడును, కస్తూరి కాదులంటి సువాసనలు వెదజల్లువాడును నగు శ్రీకృష్ణుని నా మనస్సు మఱువలేక పోవుచున్నది.

8) సమస్త ప్రపంచమును మోహింపజేయు సౌందర్యముగల శ్రీకృష్ణుని దివ్య స్వరూపమును ప్రతిపాదించు శ్రీ యతి జయదేవుల గీతము ఈ కలియుగంలో పుణ్యవంతులకెంతో పవిత్రమైనది.

అవ॥ రాధ, పైనజెప్పిన రహస్యమునే మరల భంగ్యంతరముగ జెప్పు చున్నది.

ఉ॥ ఏమని పల్కుదాన! మది–యెంతటిపాడుదో? యన్యభామినీ
ప్రేమ పయోధిలో మునిగి–క్రీడిలు కృష్ణునె కోరుచుండు, నా
స్వామి గుణంబులన్ బొగడి– సంతసమందును, రోయదెన్నడున్
రామ! విచిత్రమౌ! తిరిగి–రాదిక నాదరి; యేమి సేయుదున్. 16

తా॥ సఖీ! నా మనస్సెంత పాడుదో చూడవే! నన్ను వదలి యితర స్త్రీలతో ప్రేమతో క్రీడించు కృష్ణునే మరల నామనస్సు కోరుచున్నది. ఆస్వామి గుణంబులనే పొగడి సంతసించుచున్నది. పొరపాటున నైనను కోపింపదు. నామనస్సు నన్ను వదలిపోయి కృష్ణునియందే లగ్నమై తిరిగి రాకున్నది. నేనేమి చేయుదును? ఇది యెంతయో విచిత్రముగా నున్నది కదే!

అవ॥ రాధ కామజ్వరముచే సంతప్తయై తన చెలికత్తెను దూతిగా భావించి, తన కోరికలను నిలా వెల్లడించుచున్నది.

# 6వ అష్టపది

పల్లవి॥ కేశిహరుని యా కేశవుని – చారుశరీరుని శ్రీహరిని
వలపుల అగ్గిలో క్రమ్గ్గే నాతో
రతిపతి కేళికి రమ్మనవే – ప్రియసఖి – రతిపతి కేళికి
రమ్మనవే॥

1) చీకటిముసిరిన కుసుమకుంజముల – నొంటిగ మసలెడు నాతో
రసమయ క్రీడల ముసిముసినగవుల – రంజిలజేసిన
హరిని ॥రతిపతి॥

2) తొలికలయికలో సునుసిగ్గులతో చిఱునవ్వులు గల నాతో
తొలగిన వలువల ననువరిమాటల – మనమలరించిన
హరిని ॥రతిపతి॥

3) చిపురుల పొన్పున బిగికౌగిలిలో – ముద్దులనొసగెడు నాతో
ఎడదను బడుకొని తీయనిపెదవుల – తేనెలు గ్రోలిన
హరిని ॥రతిపతి॥

4) తనువున చెమటలుదనరగ ముదమున–కనుగవమూసెడు నాతో
మక్కువ దీరని చక్కిలిగింతలు – పులకలు రేపిన
హరిని ॥రతిపతి॥

5) కురులును రేగగ విరులునురాలగ – కలరవములుగల నాతో
చిక్కని చనుగవ గోరుల నొక్కుచు – పక్కున నవ్విన
హరిని ॥రతిపతి॥

6) తీరని తమితో రేతుదనెఱుగక – నతిరతి సొలసెడు నాతో
మతులను రతిపతి మెదలగ నలతిగ – కనులను మూసిన
హరిని ॥రతిపతి॥

7) గలగల మ్రోగెడు రతనపుటందెలు–మొలనూలునుగల నాతో
కచకుచ గ్రహణము చేయుచు నిండుగ – రతులను సలిపిన
హరిని ॥రతిపతి॥

8) యతి జయదేవుల కృతమగు కృష్ణుని – క్రీడలుగలిగిన గీతం
సుఖముల నొసగుచు నిఖిల జనులకును – శోభిలు గావుత
సతతం ॥రతిపతి॥

చిక్కని = 1) గట్టియైన 2) అలభ్యమైన.

1) తా॥ ఓ సఖీ! నేను మన్మథ సంబంధమగు కోరికలనెన్నింటినో మనసులో సంచుకొనియున్న దానను. అవి యెల్ల సఫలములగునట్లు ఆకృష్ణుని నాతో రమింపగ జేయరాదా ? అతని వేష్టలు నాకు మఱపునకు

రాకున్నవి. సంకేతస్థానమునకు నేనుబోయి కృష్ణుని గానక చీకటిలో నొంటిగ దిక్కులు జూచుచుంటిని నాకంటే ముందుగా నేతెంచి పొదలో దాగియున్న కృష్ణుడు నత్యంత రత్యుత్సాహముతో నవ్వుచూ తటాలున నన్ను గలిసికొనెను. అట్టి శ్రీకృష్ణునితో నాతో రమింప జేయుము.

2) నా తొలికూటమియందు నేను సిగ్గుతో మౌనముగా నుంటిని. ఏవేవో యనునయవాక్యములు చెప్పగా నేను చిఱునవ్వులు చిలుకరింపగా నాసిగ్గు వీడిపోయినవి. తన జఘన దుకూలము తొలగింపగా నామనసు మన్మథవశమై నా జఘనదుకూలము తనంతటతానే వీడిపోయెను. అలా నన్ను రంజింపజేసిన శ్రీకృష్ణుని రమింపజేయవే.

3) ఓ సఖీ తరువాత నన్ను చివురుల పాన్పున పరుండబెట్టి, నా యెదపై చాలాసేపు పరుండి గాఢముగా నాలింగనము జేసి మోవులపై ముద్దుల బెట్టుచుండగా నేనును ముద్దుల వడ్డించితిని. అలా మరల శ్రీకృష్ణుడు చేయునట్లు నీవు ప్రోత్సహించవే.

4) ఓ చెలీ! నేనానందవశమున కనులు మూసితిని. ఆతని చెక్కిళ్ళ గగుర్పొడిచెను. నాకు శ్రమజలము బయలుదేరి శరీరమంతయు తడిసినది. మక్కువతో చక్కిలిగింతలు బెట్టి పులకలు రేపెను. అట్లు మరల శ్రీకృష్ణునితో ప్రోత్సహించి చేయించవే.

5) ఓ చెలీ! రతాంతమున నేను కోయిల కూజితము లొనర్చుచుండ నా కొప్పు వీడెను. పూవులు రాలెను. శ్రీకృష్ణుడు నా స్తనద్వయమున నఖక్షతముల జేయుచు నవ్వసాగెను. అలా చేయునట్లు శ్రీకృష్ణుని పురికొల్పవే.

6) తీరని కామమున తెల్లవారుసమయము కూడ తెలియక, అతిరతి జేసి నేను నలసి, యచేతనమువలే భ్రమానుపడియుండగా. తానును నత్యంతా నందముచే గనుల నించుక మూయుచుండెను. నేను కళ్ళు దెఱచి

యట్టె చూచుచుండ, నాకళ్ళు నెమ్మదిగా మూయునట్లు చేతులతో మూసెను. అట్టి శ్రీకృష్ణుని నాతో రమింపజేయవే.

7) సఖీ! నా రతనాలయందెలు ముత్తెముల మొలనూలు గలగల మ్రోగు చుండగా ఒకచేత కొప్పు బట్టికొని మరొకచేత కుచగ్రహణము చేసి, మరల చేతులు మార్చి అలా పలుమార్లుచేసి తృప్తిదీఱ రమించిన శ్రీకృష్ణుని ప్రోత్సహించి మరల నాతో రమించునట్లు చేయవే.

8) శ్రీకృష్ణుని క్రీడారహస్యములు గల ఈ గీతము యతిశ్రీ జయదేవులచే విరచింపబడినదై లోకులందఱకు ననేకసుఖముల నొసగుచు శోభిల్లును గాక.

అవ॥ ఇట్లు రాధ శ్రీకృష్ణుని దివ్యరూపవిలాసములను ధ్యానించి, మనోవీధిలో బృందావనవిహారిని సేవించి ఖేదముతో తన చెలికత్తియతో మరల నిట్లు పలుకుచున్నది.

చం॥ మురళియు జార హస్తమున-ముగ్ధవధూజన దృక్చకోరముల్
సరగున వ్రాల, స్వేదకణ-జాలము నిండగ గండభాగముల్
దరిని ననుం గనుంగొనగ-లజ్జ జనింపగ, గోపికామణీ
పరివృతుడైన మాధవుడు-భాసిలగాంచితి సంతసించితిన్. 17

తా॥ ఓ చెలీ! బృందావనమున కృష్ణుడు గోపికలతో యథేష్టముగా క్రీడించుచూ, సమీపంలో నున్న నన్ను జూచినంతనే చేతిలోని పిల్లనగ్రోవి జారిపడినది. గోపికల చూపులన్నియు నాశ్చర్యంగా కృష్ణుని మోముపై వ్రాలినవి. చెక్కిళ్ళు మిక్కిలి చెమర్చినవి. సిగ్గుతో తల వంచుకొనియున్న ముగ్ధగోపాలుని జూచి సంతోషింపవలదా? లేదా? చెప్పవే.!

అవ॥ ఇప్పుడు రాధ మరల విప్రలంబ శృంగారమును చెప్పుచున్నది

చం॥ కనుగొనవే! యశోక కలి-కానవక స్తబక స్ఫురత్సరో
వనమున సంచరించుచు సు-వాసనలీనెడు పిల్లగాలులన్
దనువు దహింపసాగె, రణి-తభ్రమరీ రమణీయచూత నూ
తన సుమనోవికాసమున-తల్లడమందె మనంబు నెచ్చెలీ॥ 18

స్తబక=పూగుత్తులు; రణిత=మ్రోగుచున్న
భ్రమరీ=ఆడుతుమ్మెదలవేత; సుమనోవికాసమున=పూవుల శోభవేత

తా॥ ఓ చెలీ! విరహిజనులకు నత్యంత వేదనగల్గించు క్రొత్త పూగుత్తులతో విలసిల్లు అశోకచెట్టు చుట్టునున్న సరస్సుతో గూడిన వనమున సువాసనలతో గూడిన చల్లని పిల్లగాలులు నా శరీరమును దహించివేయు చున్నవి. ఝుమ్మని మొరయు ఆడుతుమ్మెదలు మూగుచున్న మొగ్గ తొడిగిన మామిడికొమ్మను జూచినపుడు నామనస్సెంత తల్లడపడినదో నీవేమెఱుంగుదువే.

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీతగోవింద మహాకావ్యమునందు ద్వితీయ సర్గము.

# తృతీయ సర్గము

అవ॥ కవి, కడచిన సర్గమునందు రాధకు శ్రీకృష్ణునియం దత్యంతానురాగము కలదని చక్కగా నిరూపించి, యిపుడు శ్రీకృష్ణునకును రాధయం దను రాగము గలదని నిరూపించుచున్నాడు.

ఆ॥ వె॥ కంస మర్దనుండు - సంసారవాసనా
బద్ధ శృంఖలయగు - ప్రణయమూర్తి
రాధ, మనసులోన - రాగిల్ల, గోపికా
బృందములను నట ప - రిత్యజించె॥ 19

తా॥ సంసార సంస్కారముచేత గట్టబడిన సంకెలలుగల రాధను [పూర్వ జన్మ వాసనచే సంసారమునందలి యనురాగము వీడలేదనుట] మనసు నందుంచుకొని యితరగోపికల నందఱిని విడచిపెట్టెను.

అవ॥ ఇక శ్రీకృష్ణుని విరహావస్థను వివరించుచున్నాడు.

గీ॥ కృష్ణ పరమాత్మ రాధను – నిచ్చటచట
వెదకి, యనుతాపమొందియు – వెదకి మరల,
కుమిలి, యమునానదీతీర – కుంజమందు
చాల చింతించె మదనాగ్ని – సైపలేక॥

తా॥ కృష్ణుడు విరహవేదనతో రాధను నచ్చటచ్చట వెదకి, పశ్చాత్తాపము నొంది మరల వెదకి కానక చింతించి యమునానదీ తీరాన పొదరింటిలో నుండి మిక్కిలి విషాదము నొందసాగెను,

అవ॥ శ్రీకృష్ణుని యనుతాపమును గీత రూపమున జెప్పుచున్నాడు.

# 7వ అష్టపది

పల్లవి॥ అలగి పోయెలె – అతివ రాధిక
అయ్యో రామయ – తిరిగి రాదిక
అలుక వచ్చెనో – విరహమొచ్చెనో॥

1) కన్నె మూకలు నన్ను జేరగ – కనులజూచియు కదలిపోయెలె
సీతిలేకను భీతిచేతను – కలికితోడను పలుకనైతిని ॥అలగి॥

2) ఎంతవిరహము కాంతకున్నను–ఏమిసేయును ఎటులజెప్పును?
ధనమదేలనో జనమదేలనో – నగరు నగలును
నాకునేలనో ॥అలగి॥

3) కిసుకచేతను కుటిలమౌ కను - బొమలుగలిగిన మోము గాంచిన
ఎట్టినౌ కమలమ్ము మీదను - నల్లతుమ్మెద లట్లు
దోచును ॥అలగి॥

4) తలపునందలి తనతో రతులను - తనివిదీరగ ననుభవింతును
వనమునంతట తనను వెదకుట - చింతజెందుట
యెంతవింతయొ ॥అలగి॥

5) క్రోధమొదవిన రాధయెడదలో - బాధయెంతయొ బోధపడదు
వినయ మొలుకగ ప్రణయవాక్కులు - పలుకువాడను
వెడలెనెందుకొ ॥అలగి॥

6) ఎదుటనున్నటు రాకపోకలు-సేయుచుండును తోచదేలనొ
మొదటిరీతిగ మోదమలరగ - కౌగిలీయదు
దేనికోసమొ ॥అలగి॥

7) ఇట్టినేరము సేయనింకను - నన్ను మన్ననజేయవే సఖి!
నీదు దర్శనభాగ్య మొసగవె - విరహవేదన
సైపలేనిక ॥అలగి॥

8) యల్లకరి ముగి బిందుబిల్వపు - వంశవారిధి పూర్ణచంద్రులు
భక్త స్తుతిదేవ కవులచే వర్ణితంబయి వాసికెక్కను ॥అలగి॥

తా॥ ప॥ నాపై కోపముచే రాధ యలగిపోయినది. అయ్యో రామా! ఇక రాదుగదా! భరింపరాని కోపమే వచ్చెనో లేక విరహమే అధికమైనదో తెలియదు గదా!

1) బృందావనమున గోపికలతో విహరించుచుండగా జూచి యలుకతో వెడలిపోయినది. నేను పాపరాధుడ నగుటవలన బ్రతిమాలిన నేమనునో యని భయపడి రాధను నివారింపకపోయితిని.

2) రాధకు నెంత వలపున్నను ఏమి చేయగలదు ? ఎట్లు సిగ్గువిడిచి చెప్ప గలదు ? రాధ లేని నాకు యీ ధనసంపదలేల ? యీ పరిజనులేల ? యీ గృహమును నగలును నాకేల ? తుదకు నాజీవితమేల? అన్నియు వ్యర్థములు గదా !

3) అత్యంత కోపముచేత కుటిలమగు నల్లని కనుబొమలుగల రాధ మోము నల్లతుమ్మెదలుగల ఎఱ్ఱదామరపూవువలె నున్నది గదా !

4) నా ప్రియురాలు నా హృదయమునందే యెల్లప్పుడు నివసింపగా ధ్యానముతో తనివిదీఱ ననుభవించుచున్నాను గదా! మఱి యీ యడవిలో రాధను వెదకుట చింతిల్లుట జూచిన ఎంత వింతగానున్నది.

5) నేను జేసిన తప్పునుబట్టి నీకు కోపమువచ్చెనని తలంతును. కాని ఆబాధ యంతయు నాకు తెలియకపోయెను. లేనిచో వినయముగా నిన్ను బ్రతిమాలుకొని యుండువాడను. అంతలోనే నీవు ఓర్పులేక వెడలిపోతివి. నేనేమి సేయుదును ?

6) రాధా ! నీవు యెదుటనున్నట్లే కనబడుచున్నావు. వచ్చుచున్నావు పోవుచున్నావు. కాని మునుపటివలె సంతోషముగా వచ్చి కౌగిలింప వైతివి. ఎందుకో తెలియదు కదా !

7) మరల యిట్టి యపరాధమును సేయబోను. నన్ను క్షమింపుము. నీ వియోగబాధ సహింపజాలను. నీ దర్శనభాగ్య మొసంగుము.

8) యల్లకరి బిందుబిల్వ వంశపారావార రాకా సుధాకరులగు యతిశ్రీ జయదేవులచే వర్ణించబడిన యీ గీతము ప్రసిద్ధి జెందును గాక.

వ॥ శ్రీకృష్ణుడు మన్మథ బాణములచే గొట్టబడి భ్రాంతినొంది మన్మథుని గూడ భ్రాంతునిగా దలంచి నిందాపూర్వముగా నిట్లు వక్కాణించు చున్నాడు.

చం॥ ఉరగముగాదు వక్షమున - నున్న సరోజమృణాలహార; మే
గరళముగాదు కంఠమున - గ్రాలెడు నల్లని కల్వపూలు; భ
స్మరజము గాదురా మదన - చందనగంధము; శంభుశంకచే
విరహదవాగ్ని దగ్ధు నను - వేమరు వేయకు వాడి
బాణముల్॥ 21

తా॥ ఓరీ మన్మథా! నన్ను జూచి శివుడని భ్రాంతి పడితివా? నేను శివుడను గానురా. నా చిహ్నములు శివ చిహ్నములు గావు. ఇదిగో నా ఱొమ్మున నున్నది విరహతాపము చల్లార్చుట కుంచుకున్న తామర తూడుల దండ గాని సర్పము కాదు. నాకంఠమున నున్నది నల్లని కల్వపూగుత్తి గాని విషము కాదు. నా శరీరమున నలముకొన్నది చల్లని చందనగంధమే గాని బూడిద గాదు. ఏల విరహానలముచే తపించెడు నాపై వాడి బాణములు విసరెదవు?

అప॥ ఇప్పుడు శ్రీకృష్ణుడు మన్మథబాధను సహింపజాలక దీనుడై మన్మథుని నిందించుచున్నాడు.

ఉ॥ చక్కెరవింటి నెక్కిడి రసాల శరమ్ముల వ్రేయబోకు; మా
జక్కవ చంటి కన్గొనల - జాటినతూపుల నొచ్చియున్న నా
చక్కని మానసంబకట; - స్వస్థత జెందగలేదు; దర్పకా!
స్రుక్కిన వారలం బొడువ - జూచుట పౌరుషమా!
ప్రతిష్ఠయా? 22

తా॥ ఓరీ మదనా! చక్కెరవింటి నెక్కుబెట్టి మామిడి చివురుల బాణము లేయకుము, చతుర్దశ భువనములను నొక్కసారి విలాసముగా జయించిన మహా పౌరుషశాలివగు నీకు మూర్ఛితుడగు నొక సామాన్యజనుని బట్టి వేధించుట పాడి గాదు. ఆ జక్కవ చంటి రాధ కటాక్షబాణ పరంపర చేత నా హృదయమంతయు జర్జరితమై నా మనస్సు ఏమియు స్వస్థత నొందలేదు. చచ్చినవానిని చంపజూచుట పౌరుషమనుకొంటివా లేక ప్రతిష్ఠ యనుకొనుచున్నావా?

అవ॥ "అయినను రాధయొక్క శరీర కటాక్షాది విలాసముల స్మరించుట వలన నీకు దుఃఖము కల్గుచున్నది కాని మన్మథుడేమి యపరాధము జేసెను?" అనిన జెప్పుచున్నాడు.

చం॥ కనుబొమ కార్ముకంబు, కడ - కన్నుల చూపులు తూపులున్, శ్రుతుల్
గుణములుగా నొనర్చియు సు-కోమలి జంగమదేవతా స్వరూ
పిణి యగు రాధలో నునిచి-పేర్మి జగమ్ముల గెల్చు మీనకే
తనుని యనల్ప కౌశలము - ధారుణి నెవ్వరు
మెచ్చకుందురో ? ౭౩

తూపులు = బాణములు; శ్రుతులు = చెవులు.

తా॥ మన్మథుడు లోకములను జయించుటకై తన జయమునకై నడయాడెడు దేవతవలె నున్న యా రాధయందు లోకములనెల్ల జయింపజాలినవగు నస్త్రములను అనగా ఆమె కనుబొమయే ధనస్సుగను జంకెన వాడి చూపులే బాణములుగను కర్ణపాళియే అల్లెత్రాడుగను నిల్పియున్నాడు కాబోలును. అట్టి మన్మథుని కౌశలమును నెవ్వరు మెచ్చకుందురు ? [అనగా ప్రశంశింతురనుట.]

అవ॥ ఇపుడు "స్మరణరూపములగు రాధయొక్క యుపంపుప విలాసములే గదా నన్నింతగా బాధించుచున్నవి. కాన నాపెనే దూషింపవలయునని" మన్మథుని వదలి రాధ తనముందున్నట్లు భావించి దూషించుచున్నాడు.

ఉ॥ మత్త దృగంత బాణములు - మర్మములంటెన నంటవచ్చు; ను
ద్వృత్త పిసీల వక్ర కబ - రీ భరమాత్మల చెండవచ్చు; హు
ర్మత్తుగ రాగవంతుడగు - మంకెనమోవి మధింపవచ్చు; స
ద్వృత్త కుచద్వయమ్ము మది - యింపగ జూచుట
న్యాయమే సఖీ ! 24

దృక్ = కన్ను; ఉద్వృత్త = అధికమైన; హర్మత్తుగ=మిక్కుటముగ
సద్వృత్త = 1) గుండ్రముగానున్న 2) మంచి చరిత్రము గలవి
రాగవంతము = 1) ఎఱుపు గలిగినది 2) మోహమును గలిగించునది

తా॥ సుందరీ! నీ కటాక్ష బాణములు కనుబొమయను ధనుస్సున నెక్కబెట్టబడినవి గాన నవి పరులమర్మమును వేధించుట యుక్తమే; నీ నల్లని కేశపాశము కుటిలమైనదిగాన పరుల ప్రాణములను దీయుటకు ప్రయత్నించుటయు యుక్తమే; నీ యధరబింబము రాగవంతముగాన మోహమును గలిగించుట భావ్యమే; కాని సద్వృత్తమగు నీ కుచమండలము గూడ నా ప్రాణములను తీయ జూచుచున్నదే! ఇది ఏమి న్యాయము?

అవ॥ ఇపుడు వక్రోక్తిచే విరహాతిశయమును దెల్పుచున్నాడు.

ఉ॥ అట్టిది స్పర్శసౌఖ్యమును - నట్టిది మంజుల చక్షువిభ్రమం
బట్టిదికా మనోహర ము-ఖాబ్జ సుగంధము వక్రవాఙ్మధూ
శట్టిది బింబికోష్ఠమధు-రామృతమట్టిది గోచరమ్ములై
దట్టివటుంచు మానసము హత్తిన నెంత విరాళి గల్గెడిన్॥ 25

వక్ర=వికటమైన (వేరుఅర్థము గల) గోచరములు=ఇంద్రియములు
శబ్ద - స్పర్శ - రూప - రస - గంధ.
చెవి - చర్మము - నేత్రము - నాలుక - ముక్కు.

తా॥ ఏ యింద్రియ సుఖమునకైన నరుడు లోనుగావలసినదే - అయిదు ఇంద్రియములు బలవత్తరములైనవే స్పర్శసుఖము అటువంటిది - [చెప్ప నలవికానిది.] నేత్రముల విలాసమును నట్టిదే - ముఖకమలము యొక్క పరిమళమును నట్టిదే - చాతుర్యముగల మాటలును నట్టివే - అధరబింబ మాధుర్యమును సహితము నట్టిదే - ఆ యింద్రియ సౌఖ్యములను దలంచినకొలది విరహమధికమగుచుండునే గాని తగ్గిపోజాలదు కదా!

వి॥ ఇప్పుడనుభవించుచున్న స్పర్శసుఖము పూర్వము రాధతో ననుభవించినదే - ఆ నేత్రవిలాసములును అనాటివే - ఆ ముఖకమల పరిమళమును నదే - వక్రిమగల నేర్పుమాటలు నవియే - అధరబింబ మాధుర్యమును నయ్యదియే - ఇటుల ఆయా యింద్రియముల విషయముల ననుభవించుచు, నా మనము రాధయందేకాగ్రమై యున్నను ఈ విరహవ్యాధి వృద్ధినొందుచున్నది. ఇది ఏమి విచిత్రము!

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత
గోవిందము నందలి తృతీయ సర్గము.

# చతుర్థ సర్గము

అవ॥ పూర్వ సర్గములందు రాధామాధవుల మన్మథావస్థలను వేరువేరుగా నిరూపించి వీరిద్దఱి నొక్కచో గూరుపదలంచి యిప్పుడు దూతీయోగము జెప్పబడుచున్నది.

గీ॥ రాగభయములు రెండును - రగులగ, యము
నా నదీతీర వానీర - నవ నికుంజ
గతుడగు మురారితో, రాధి - కా సఖి, నయ
వినయము లెసగ, నిట్లని - విన్నవించె॥ 26

వానీర = ప్రబ్బలి.

తా॥ భయానురాగములు రగులుకొని వృద్ధికాగా, నత్యంతప్రేమచే నామెను ధ్యానించి ధ్యానించి, యెట్టకేలకు మనస్సాక్షాత్కారము చేసికొని. రాధను వెదకుట, మాని యమున యొడ్డున ప్రబ్బలి పొదరింటిలో గూర్చుండిన శ్రీకృష్ణునితో, రాధ చెలికత్తియ వినయముగా నిట్లు విన్నవించుచున్నది.

# 8వ అష్టపది

పల్లవి॥ నీ విరహంతో రాధ దీనయైనదిరా కృష్ణా!
మదన బాణముల బెదరున నీలో లీనమైనదిరా॥

1) గంధము జాబిలి గాలిని గనుగొని-నిందించుచు తానున్నది
పాములతాకిడి నన్నియు విషమని - బాముల నొందుచు
నున్నది ॥నీ॥

2) మదిగల నిను కాపాడుటకొఱకై -మదనుని శరముల మార్కొన
తడిసిన తామర రేకుల నెడదన - కవచము జేయుచు
నున్నది ॥నీ॥

3) కాముని ములుకులు కలువలు తమ్ముల - పువ్వుల
శయ్యను వ్రతముగ
నీదగు కౌగిలి నిశ్చలసుఖముకు - నెనరున జేయుచు
నున్నది ॥నీ॥

4) రాహువు కాటుల రాలెడు నమృతపు - ధారలుగల
రేవెలుగులా
కళ్ళను నీళ్ళను గారెడు గొనమగు - నెమ్మొగముతో
తానున్నది ॥నీ॥

5) మారసమానుని నిను కస్తూరితో - మహిపై వ్రాసియు కరముల
మామిడి చివురుల మకరము నిడుచును - మరిమరి
మ్రొక్కుచు నున్నది ॥నీ॥

6) చిక్కని నిను ధ్యానంబున నెదుటను - నున్నటు కల్పన
జేయుచు
కుములుచు నవ్వుచు సొలయుచు తిరుగుచు- కొందలమందుచు
నున్నది ॥నీ॥

7) విముఖుడవైనను మాధవ నీపదముల- బడితిని మఱి చంద్రుడు
తాపము రేపుచు నున్నాడనుచును - తానటు బలుకుచు
నున్నది ॥నీ॥

8) యతి జయదేవ ఫణితమగు రాధా-సఖిచే బలికిన గీతం
అందఱిమనముల నధికానందము - గలుగగ జేయును
నిత్యం ॥నీ॥

మరిమరి = సారె సారెకు.

తా॥ ప॥ ఓ కృష్ణా! రాధ నీపై విరహముతో నతిదీనురాలై యున్నది. మన్మథ బాణములు బడునను భయముచేత ధ్యానము వలన సాక్షాత్కరించిన నీలో లీనమై పోయినది.

1) పాములు సువాసనకు గంధపుచెట్లను చుట్టుకొనుట చేతను, చంద్రుని రాహువు కాటువేయుట వలనను, పాములు వాయువును భక్షించుట చేతను గంధము, జాబిల్లి, వాయువు ఈ మూడును పాముల స్పర్శ చేత విషపూరితములని నిందజేయుచు రాధ బాధపడుచున్నది.

2) తనపై మన్మథుడు విరిశరములు గుప్పించివేయుట వలన, తన హృదయమున నున్న నీకు ప్రమాదము గలుగునను భయముచేత, నిన్ను రక్షించుకొనుటకై, రాధ నీటితోగూడిన తామరరేకులను గప్పి కవచముగా జేయుచున్నది. [అనగా అది శీతలోపచారము.]

3) రాధ నీ యాలింగన సౌఖ్యమును గోరి, అసిధారావ్రతమును నాచరించుచున్నది. ఎట్లనగా మన్మథుని బాణములగు కలువలు తామరల అంపశయ్యపై వ్రతము నాచరించుచూ సకల మన్మథకళలకు నాకరమైన పూలపానుపునందు శయనించియున్నది.

4) రాధ, నీ వియోగ దుఃఖమువలన, కన్నీరు మున్నీరుగా ధారలు గారునట్లు దుఃఖించుచుండుటవలన సౌందర్యమైన యామె ముఖము, గ్రహణ కాలమందు రాహువు కోరలచే కాటువేయగా ధారలు ధారలుగా నమృతము వర్షించునట్లు ప్రకాశించుచున్నది.

5) కృష్ణా! ఆ రాధ యేకాంతమునందు కస్తూరిచే మన్మథునిగా నిన్ను జిత్రించుచున్నది. ఆ మన్మథ విగ్రహము క్రింద వాహనముగా మొసలిని, చేతులలో లేమావి చిగురుల బాణములను వ్రాసి "ఓ మన్మథా నన్ను బాధింపకుమని" నమస్కరించుచున్నది. [మన్మథ పూజ గావించుచున్నది.]

6) ఓ కృష్ణా! మునీంద్రులకే యలభ్యమైన నిన్ను ధ్యానబలముచే, నీవు తనముందున్నట్లు భావించి, విచారపడుచున్నది, నవ్వుచున్నది. అలసి సొలసి పోవుచున్నది. అటు నిటు తిరుగుచు ఎంతో బాధపడుచున్నది.

7) ఓ కృష్ణా! ఆ రాధ యడుగడుగునకు "ఓ మాధవ! నీ పాదములపై బడితిని నీవు నాకిపుడు పరాఙ్ముఖుడవై యున్నందున అమృతకిరణు డగు చంద్రుడు సహితము నా శరీరమును దహించుచున్నాడ" ని పలుకుచు నిన్నే ధ్యానించుచున్నది.

వి॥ మాధవ యని పిలుచుట వలన శ్రియఃపతియైన నీవు నాదగ్గఱనే నాకనుకూలుడవై యుండునపుడు లక్ష్మికి నేను చవితినయ్యును నీవలని భయముచే లక్ష్మి సోదరుడగు చంద్రుడు నన్నేమియు చేయజాల కుండెను. నీవు ప్రతికూలుడవై యున్న ఈ కాలమున ననినచో చంద్రుడు సుధానిధి యయ్యును ఆ క్రోధము నంతయు నాపై జూపించి కాల్చివేయుచున్నాడు.

8) శ్రీయతిజయదేవులచే వ్రాయబడినదియు, రాధా సఖిచే బలుకబడినదియు నగు నీ గీతము అందఱి హృదయములలో నధికానందము గలుగ జేయును గాక.

అవ॥ వేయేల? నీవు ప్రతికూలుడవైనందున నన్నియు నామెకు ప్రతికూల ములే యగుచున్న వనుచున్నది.

శా॥ ఆవాసంబు నరణ్యమయ్యెను, సఖీ - హల్లీసక క్రీడలున్
భావింపన్ వలలయ్యె, నిశ్వసనతా-పంబుల్ మహోగ్రంబులా

దావజ్వాలలునయ్యె త్వద్విరహబా-ధాతప్తయౌ రాధకున్
పూవిల్తుండు కృతాంతుడయ్యె నకటా - పూబోడి
యెట్లోర్చెడిన్॥ 27

ఆవాసము = గృహము; హల్లీసక క్రీడ = స్త్రీలు పెక్కురు మండలాకారముగా చేయు నృత్యం.

తా॥ ఓ కృష్ణా! నీవు రాధ సమీపమున లేనందున రాధకు గృహమే యరణ్యభూమి యయ్యెను చెలికత్తెలు చుట్టు గుండ్రముగా నిలబడి చేయు నృత్యములే వలలమాదిరి కన్పట్టెను. తాపముతో గూడిన నిశ్వాసములు దావాగ్నిజ్వాలలైనవి. అయ్యో! ఏమి చెప్పుదును. మన్మథుడు నామెపాలిటి యముడయ్యెను. ఆమె ప్రాణములు నిలుచుటెట్లో గదా!

వి॥ ఇక్కడ ఉద్వేగావస్థయు, వ్యాధ్యవస్థయు వర్ణింపబడినవి.

# 9వ అష్టపది

అవ :- ఇపుడు ఎనిమిదవది యగు వ్యాధ్యవస్థను వివరింపదలచి చెలికత్తె చేత గీతరూపమున చెప్పించుచున్నాడు.

పల్లవి॥ రాధిక కృష్ణా రాధిక
రాధిక నీ విరహమున కేశవా! ॥రాధిక॥

1) స్తనముల హరువగు హారమునైనను
తలచును భామిని భారము వలెను ॥రాధిక॥

2) తనువున మృదువగు గంధమునైనను
కనుగొను కామిని గరళము మాదిరి ॥రాధిక॥

3) సెగల రగులు నిశ్వాసము సైతము
సైచును మానిని మరునగ్గి కరణి ॥రాధిక॥

4) తొడిమలు విడియు తోయము లురలెడు
కనుదామరలను కపలను బఱచును ॥రాధిక॥

5) కనులకు దోచెడు తలిరుల సెజ్జను
విరహుల గాల్చెడి చిచ్చని తలచును ॥రాధిక॥

6) చలనము నెఱుగని చలువల ఱేడగు
చెక్కిలి నంటిన చేయిని వీడదు ॥రాధిక॥

7) మరణము నొందెడు విరహిణి విధమున
హరిహరి యనుచును స్మరణము జేయును ॥రాధిక॥

8) శ్రీయతి జయదేవ స్తుతగీతం
శ్రేయము లొసగును శ్రితులకు సతతం ॥రాధిక॥

తా॥ 1) ఓ కృష్ణా! రాధ నీ వియోగము వలన గృశించినదై చెలికత్తెలచే స్తనములపై నుంచబడిన హారమునుగూడ నెంతో భారముగా దలచుచున్నది.

2) శ్రీకృష్ణా! శరీరమునందు బూసిన సరసమైన స్నిగ్ధమైన చందన పంకమును గూడ భయముతో విషమువలె జూచుచున్నది.

3) చెప్ప నలవికాకుండునట్లు మిక్కిలి దీర్ఘముగా విడచు నిట్టూర్పు వాయువు లతితాపముతో మన్మథాగ్నివలె ధరించుచున్నది.

4) కృష్ణా! రాధ మిక్కిలి దుఃఖముచే కన్నీటితో, కాడలూడి నీటిబిందు వులురాలు కమలములవలె నున్న కన్నులతో ప్రతి దిక్కును మాటి మాటికి జూచుచున్నది.

5) ఆరాధ, చివురుల సెజ్జ ఎదుట కనులకు గనబడుచున్నను, అగ్ని హోత్రమో యని సంశయించుచున్నది.

6) ఓ కృష్ణా! ఆ రాధ సాయంకాలమున జలింపకుండు చంద్రునివలె నున్న తన చెక్కిలిపై జేయి చేర్చుకొని తీయకున్నది.

7) ఓ కృష్ణా! ఆ రాధ నీ వియోగముచే మరణము నొందుచున్నది వలె మిక్కిలి యభిలాషతో మాటిమాటికి హరిహరి యని జపించుచున్నది.

8) శ్రీ యతి జయదేవ కవులచే కీర్తింపబడిన యీ గీతము శ్రితజను లందఱికి శుభములను గలుగజేయును గాక.

అవ॥ మన్మథవ్యాధికి వైద్యము జెప్పుచున్నాడు.

గీ॥ యదుకులాంబుధి చంద్రమ! - అమరవైద్య
హృద్య! అంగజరోగ స-హితఁ మదీయ
సఖిని రాధను, భవదంగ - సంగ సుధ నొ
సంగి రక్షింపకున్న వ - జ్రంబు కన్న
కఠిన హృదయుడ వగుదువు - గద యుపేంద్ర! 28

తా॥ అశ్వినీ దేవతవలె సుందరుడవగు కృష్ణా! రాధ మన్మథ జ్వరముచే మిక్కిలి బాధనొందుచున్నది. నీ శరీరసంగామృత మామెకు సోకిననే గాని యాబాధ నివర్తింపదు. కావున నట్టిబాధను నివర్తింపజేయుము. లేకున్న నీవు వజ్రమునకన్న కఠినుడవగుదువు.

వి॥ వజ్రము ఇంద్రునిచే ప్రయోగింపబడినదై శరీరమునంబడియే బాధించును. నీవు దూరమునుండియే బాధింతువు. కాన నీవు వజ్రమున కన్నను కఠినుడవు

మ॥ కమలాస్త్రజ్వర సంజ్వరాకుల మనః-కంజాతయై రాధ, సా
ర్థముగా చందన చంద్రమః కమలినీ-తాపంబునొందున్, విచి
త్రముగాదోచు ప్రియుండవౌ నిను సదా-ధ్యానించి
యత్యంతమున్
తమియై చల్లనివానిగా, మనుటసా-ధ్యంబంచు
తానెంచుటల్॥ 29

తా॥ ఓ కృష్ణా! ఆ రాధ మన్మథజ్వర సంతాపముచే మిక్కిలి వ్యాకులు రాలయ్యెను చల్లని పదార్థములగు చందనమును, చంద్రుని, తామర తీగలను మనస్సునందైన సహింపదు. [వీటిని చల్లని పదార్థములుగానే తలంపదు.] వాటిచే తాపము బొందుచున్నది. ప్రియుడవగు నిన్ను మాత్రమే చల్లనివానిగా దలచి ధ్యానించుచు బ్రతుకునెట్లో నీద్వవచ్చు నని తానట్లు భావించుట ఎంతో విచిత్రముగా దోచుచున్నది. [నీవాలస్యముఁ జేసితివేని యీలోపల నామె ప్రాణములు నిలిచియుండునో లేదో యని నేను నిశ్చయముగా శంకించుచున్నాను.]

అవ॥ అయిన నింతకాలమువరకెట్లు జీవించెనో యట్లే యిప్పుడును జీవింపదా యనినచో చెప్పుచున్నాడు.

గీ॥ నయనములు మూసి ఖిన్నయై – న సఖి, నీదు
పూర్వ విరహంబు క్షణమైన – నోర్వబోదు;
చిర వియోగంబుచేత పు – ష్పిత రసాల
శాఖ గని యెట్లు జీవింప – జాలు కృష్ణ? 30

తా॥ కన్నులు మూసి ఖిన్నురాలైన రాధ క్షణమైన నీ పూర్వవియోగమును సహింపకుండ నుండునది కదా! అట్టి రాధ పుష్పించిన తియ్య మామిడి కొమ్మ మ గనియు నెట్లు నీ వియోగమును సహించి బ్రతుక గలదు?

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహా కావ్యమునందు చతుర్థ సర్గము.



# పంచమ సర్గము

అవ॥ ఇప్పుడు శ్రీకృష్ణుడు రాధాసఖి యెఱిగించిన వృత్తాంతమును విని యాపె కభిముఖుడై "రాధను పిలుచుకొని రమ్మని" యా చెలికత్తెను బంపుచున్నాడు.

గీ॥ నేను పొదరింట వేచెద, - నీవు వెడలి
రాధ నోదార్చి యిటు గొని - రమ్మటంచు,
వెన్ను డంపంగ చెలికత్తె - వేగ నేగి,
వెలదిఁ గనుగొని తానిట్లు - విన్నవించె॥

తా॥ "నేనీ పొదరింటియందే వేచియుందును. నీవు త్వరగా బోయి రాధ నూఱడించి పిలుచుకొని రమ్మంటిననని చెప్పి వేగముగా నిచ్చటకు బిలుచుకొని రమ్ము" అని శ్రీకృష్ణు డాజ్ఞాపింపగా చెలికత్తె రాధ సన్నిధి కేతెంచి యీలాగున పలుకసాగెను.

## 10వ అష్టపది

పల్లవి॥ నీ విరహమున వనమాలి - నెవ్వగజెందెనె చెలి రాధా!

1) మరుడును తోడైరాగా - మలయానిలము వీచగ
విరహుల యెడదలు స్రీలగ-విరులును తరులను విగియగ ॥నీ॥

2) కలువలరాయడు కాల్చగ - కనుగొని కలవరమందేను
కామునిశరములు కురియగ- కాలము సేయగ బూనేను ॥నీ॥

3) చేరువతేటులు మ్రోయగ - చేతుల చెవులను మూసేను
మదిలో విరహము మెదలగ-మాపుల నిదురను మానేను ॥నీ॥

4) కాఱడవులలో గదలుచు - కాపురమును తా మఱచేను
నేలపఱుపుపై పొరలుచు - నీపేరులనే బలికేను ॥నీ॥

5) కోయిల గుంపులు కూయగ – కొందలమందుచు బోయేను
ఎవరైనను గని నవ్వగ – ఎదలో వలపును దాచేను ॥నీ॥

6) పారావతములు బలుకగ – రతిగళ రవముగ దలచేను
నీ కలయికలో కలిమిని – నిచ్చలు మేలని యెంచేను ॥నీ॥

7) నీ శుభనామము గలిగిన – నెల నెవ్వారలో పలికిన
పరవశమున జపియించుచు–పరసతులను తా మఱచేను ॥నీ॥

8) విరహ విలాసము గలిగిన – యతి జయదేవుల గీతము
వినియెడు పుణ్యుల మనముల – వెలయును శ్రీహరి
నిరతము ॥నీ॥

తా॥ ఓ చెలీ రాధా! మలయ మారుతము మన్మథుని సహాయము జేసికొని వీచుచుండగా, విరహిజనుల హృదయముల జీల్చుట కొఱకును బోలె బుష్పసమూహము వికసించుచుండగా శ్రీకృష్ణుడు నీ వియోగముచే మిక్కిలి బాధనొందుచున్నాడు.

2) రాధా! చంద్రుడు తన కిరణములచే దహించుచుండగా, శ్రీకృష్ణుడు మరణము శ్రేయమని తలంచుచున్నాడు. మన్మథుడు పుష్పబాణములను బ్రయోగింపగా, నాదెబ్బలకు తాళజాలక మిక్కిలి సోలిపోయి, మరణించుటకు ప్రయత్నమొనరించుచున్నాడు.

3) ఓ రాధా! శ్రీకృష్ణుడు తుమ్మెదలగుంపు ఝుమ్మని ఝంకారము సేయ నారంభింపగా, చెవులను రెండుచేతులతో మూసికొనుచున్నాడు. ప్రతి రాత్రి యందును నీ వియోగము తలంపునకు వచ్చెనేని చెప్పరానివ్యథ జెందుచున్నాడు.

4) రాధాదేవీ! శ్రీకృష్ణుడు అరణ్యములందే తిరుగుచున్నాడు. మనోహర మగు తన గృహమును వదలిపెట్టినాడు. ఎల్లప్పుడు భూశయ్యయందే పొరలాడుచున్నాడు. "ఓ రాధా! ఓ ప్రియురాలా!" యని యనేక ప్రకారముల నీ నామమునే యుచ్చరించుచున్నాడు.

5) శ్రీకృష్ణుడు కోకిల గుంపు కూయగనే యాధ్వని కోర్వలేక ప్రతిదిక్కుకు నకు బరువెత్తుచున్నాడు. ఇట్లు నిష్కారణముగా పరుగెత్తుట జూచి జనులు నవ్వుచుండగా, నేమియు లేదని సమాధానము జెప్పుచు, విరహమును గప్పిపుచ్చుచున్నాడు.

6) చెలీ! శ్రీకృష్ణుడు పావురముల ధ్వని వినబడినంతనే రతికూజితమును స్మరించుచున్నాడు. నీ రత్యానంద సంపదవలన గలిగిన సుగుణమునే మిక్కిలి కొనియాడుచున్నాడు.

7) రాధా! ఎవ్వడైన రాధ యని నీపేరైన వైశాఖ మాసమును పేర్కొనెనేని ప్రేమతో వినుచున్నాడు. [వైశాఖే మాధవే రాధా - అమరము.] ఆ రాధ యను మాసమునే యత్యంతానురాగముతో జపించుచున్నాడు. ఇతర యువతుల నెవ్వరిని ప్రేమింపకున్నాడు.

8) శ్రీయతి జయదేవులచే చెప్పబడిన, విరహవిలాసము గలిగిన ఈ గీతమును విను పుణ్యాత్ముల హృదయకమలములలో నెల్లవేళల శ్రీహరి వెలయును గాక.

మ॥ రమణీ! యే పొదరిండ్ల పూర్వము మహా-రాగంబుతో మారకా
ర్యము లెల్లం జవిచూచిరో యిరువురా - యాకుంజ తీర్థంబులం
దు మహాభక్తిఁ జపించు నీ పలుకులన్ - దోషాచరారాతి తో
రముగా, త్వత్కుచకుంభ నిర్భర పరీ - రంభామృతా
సక్తితో॥ 52

మార కార్యములు=మన్మథ కార్యములు; దోషాచరారాతి=కృష్ణుడు
అమృతాసక్తితో = మోక్షమునందాసక్తితో.

తా॥ రాధా! పూర్వము నీవును కృష్ణుడును గలిసియున్నపుడు, ఏయే పొదరిండ్లలో మన్మథకార్యములన్నియు సాంగముగా సిద్ధించినవో అట్టి మన్మథ మహాతీర్థములగు పొదరిండ్లలో నిప్పుడును కృష్ణుడు కూర్చుండి యనవరతము నిన్నే ధ్యానించుచు, నీ ముద్దుల పలుకుల నెడ

మంత్రములను జపించుచు, నీ కుచకుంభముల బిగికౌగిలింత యను మోక్షమును గోరుచున్నాడు.

అవ॥ ఇపుడు చెలికత్తియ యించుక ప్రసాదోన్ముఖురాలగు రాధను వేగముగా శ్రీకృష్ణుని కడకు బొమ్మని త్వరపెట్టుచున్నది.

# 11వ అష్టపది

పల్లవి॥ యమునాతటమున మలయానిలమున-వనమునగలదేవనమాలి
గోపవధూస్తనమర్దన జేయగ – కదలెడు **కరములు** గలశౌరి

1) రతిసుఖనిధియగు సంకేతస్థలమునగల మన్మథరూపుని
నీ[illegible]సకు బొమ్మా! జాగును జేయకె
బంగరుబొమ్మా! ॥యమునా॥

2) నిన్నె పిలుచుచు గుఱుతును దెలుపుచు మృదువుగ
మురళిని నూదేను
నీమెయి తాకిన గాలికి రేగిన రేణువునెంతో
పొగడేను ॥యమునా॥

3) ఆకులు గదలిన నీకలురాలిన నీరాకను శంకించుచు
చక్కని చివురుల శయ్యను జేయుచు దిక్కులు దారులు
జూచేను ॥యమునా॥

4) అంగజక్రీడల రంగుగ మ్రోగెడు బంగరుటందెలు పీడియు
నల్లని వలువతో మెల్లగ నిరులలో వెళ్ళవె
యా పొదరింటికి ॥యమునా॥

5) పున్నెపు కొమ్మవు వెన్నుని ఱొమ్మున
పురుషాయితమును జలుపగ
మేఘముత్తానై మెఱపువు నీవై చెలువుగ నలరుదు
చెలియా ॥యమునా॥

6) మొలనూలు దీసి వసనమ్ము వదలి అలరుల చిపురుల పాన్పున
ఎలమికి తొలికారణమగు నిధివలె జవ్వని!
జఘనము జేర్చుమ ॥యమునా॥

7) హరి యనురాగముతో నటనుండును హా! సఖి! వేకువ
యయ్యెను
నానుడులను విని త్వరత్వరగా జని కృష్ణుని కోరిక
దీర్చుమ ॥యమునా॥

8) శ్రీహరి భక్తులు యతి జయదేవులు బలుకగ రమణీయముగా
కమనీయుడైన కమలాపతి పద కమలములను
సేవింపుడి ॥యమునా॥

ఇరులు = చీకటి; ఎలమి = సంతోషము.

**తా॥ ప॥** రాధా! గోపవధూ కుచమర్దనమునం దాసక్తిగల శ్రీకృష్ణుడు చల్లని పిల్లవాయువులచే నుల్లసిల్లు యమునా తీరములో నుద్యానవనము నందు గలడు.

1) రాధా! రత్యానందము చేకూర్చునట్టి సంకేతస్థానమునందు, మన్మథుని వంటి చక్కని యాకారముతో వెలుగుచున్న శ్రీకృష్ణుని కడకు బొమ్ము. ఆలస్యము జేయకుము.

2) ఓ చెలీ! శ్రీ కృష్ణుడు తన సంకేతస్థళమును తెలియజేయుచు, నీ నామాక్షరములతో మనోహరముగా వేణువును వాయించుచున్నాడు. నీ శరీరమునకు దాకి వచ్చిన వాయువుచే రేగిన పరాగమును గూడ వెంతయో గౌరవించుచున్నాడు,

3) ఓ రాధా! వనమందు ఆకులు కదలినను, పక్షిఱెక్కల యాకలు రాలినను నీవు వచ్చుచున్నావని శంకించుచు కృష్ణుడు చివురులతో పడకను తయారుచేయుచు దిక్కులు దారులు జూచుచున్నాడు.

4) ఓ రాధా! మన్మథ క్రీడలయందు గదలుచు గణగణ మ్రోయునట్టి యందెలను శత్రువులవలె వదలిపెట్టుము. నల్లని ముసుగు వేసికొని అంధకార బంధురమగు పొదరింటికి బొమ్ము.

5) రాధా! నీవు పుణ్యపరిపాక రూపమైన పురుషాయితము నొనర్చునపుడు నీవు కృష్ణుని వక్షస్థళమున నున్న కారణమున అతడు మేఘమువలెను, నీవు మెఱపుతీగ వలెను ప్రకాశింపగలవు.

6) ఓ రాధా! కోటి మన్మథాకారుడగు శ్రీకృష్ణుని దర్శన మాత్రముననే వస్త్రములు వీడిపోవును మొలనూలును జారిపోవును. ఏమియు నాచ్ఛాదనము లేని బంగారుకాంచులొలుకు నీ జఘనమును చివురుల పానుపునందు నానందదాయకమగు నిక్షేపమువలె నుంచరాదా?

7) రాధా! శ్రీకృష్ణుడు బృందావనములో మిక్కిలి యనురాగముతో నున్నాడు. తెల్లవారుఝాము కావచ్చినది. నా మాటలు విని త్వర త్వరగా వెళ్ళి కృష్ణుని కోరిక నెఱవేర్చుము.

8) భక్తాగ్రేసరులారా! భగవత్సేవా తత్పరులగు శ్రీయతి జయదేవులు మనోహరముగా శ్రీహరి కీర్తనలు బాడుచుండగా, కైవల్యానాథుడైన కమలాపతి పదకమలములను మనసార సేవింపుడు.

అవ॥ ఇపుడు రాధ శ్రీకృష్ణుని కడకు సత్వరముగా వచ్చుటకై చెలికత్తియ యామెకు ప్రోత్సాహమును గలుగజేయుచున్నది.

మ॥ నెలతా! నీ హృదయేశ్వరుండు వనిలో-నిట్టూర్చు చున్నాడు; దా
రుల వీక్షించి నికుంజ గేహములలో – రోదించుచున్నాడు; వ్యా
కులితుండై విధుమన్మథాదుల కడున్-క్రోధించుచు న్నీదు రా
కల కాంక్షించుచు, మీనకేతన రణ-క్లాంతుడునై నిచ్చలున్॥ 33

తా॥ ఓ రాధా ! నీ ప్రియుడు మన్మథదుఃఖముచే మిగుల పీడింపబడినవాడై, నీవు రాలేదని తలచి, మాటిమాటికి నిట్టూర్చుచున్నాడు. నీవేదారుల వచ్చెదవో యని దిక్కులుజూచియు పొదలలో నీవు దాగియున్నావేమో యని చూచి, కనరాక దుఃఖించుచు, చంద్రుని, మన్మథునిపై కోపగించుచు నీరాకకై నిరీక్షించుచున్నాడు.

అవ॥ ఇపుడు శ్రీకృష్ణుని కడకు బోవుటకు సమయమిదే యని సహేతుకముగా జెప్పుచున్నది.

శా॥ నీ వక్రత్వముతో సమంబుగ, దివా-నిర్మాతయున్ గ్రుంకె, నా
శ్రీవైకుంఠమనోరథంబు విధమున్ - శీఘ్రంబుగా గహ్వరం
బావిర్భూతమునొందె, దీర్ఘమగు-నాయభ్యర్థనల్ చక్రవా
కావర్తంబగు దీన నాద గతితో - నావిష్కరింపంబడెన్
నీవాలస్యముజేయఁబోక, హరి సాన్నిధ్యంబునుం జేరవే॥ 34

వక్రత్వము = పెడతనము; గహ్వరము = చీకటి.

తా॥ ఓ రాధా! నీ పెడతనముతో సమానముగా సూర్యుడు సంపూర్ణముగా నస్తంగతుడైనాడు. శ్రీకృష్ణుని మనోరథమువలె చీకటి దట్టముగా బర్విననది. చక్రవాక పక్షుల కరుణస్వరమువలె నా ప్రార్థన దీర్ఘమైనది. ఓ ముగ్ధురాలా ! యిక ఆలస్యము జేసిన లాభము లేదు. శ్రీకృష్ణుడుండు సంకేత స్థానమునకు బోవుట కిదియే మంచి సమయము.

అవ॥ ఇపుడు మఱియు నంధకారము దట్టముగా వ్యాపించియున్నందున నిదియే యభిసారమునకు సమయమని మరల చెప్పుచున్నది.

మ॥ ఇరులున్ గ్రమ్మిన కుంజపుంజములలో-శ్రీశుండు చింతించు "నా
దరికిన్వచ్చి ననుంగనున్ - మరుకథల్ తానెప్డు గుప్పించు, ప్రీ
తిరమించు బిగికౌగిలించు" నని యా-ర్తింజెందు-దోతెంచియున్
పరికించున్, పులకించు, నీయభిధలన్-పల్మారు బిల్చున్సఖీ ! 35

అభిధ = పేరు,

తా॥ ఓ రాధా ! కృష్ణుడు మిక్కిలి దట్టమగు చీకటిపర్వైన యొక పొదరింటిలో జేరి "ఆ రాధ యెప్పుడిచటికివచ్చి నన్ను జూచును ? మన్మథకథలను జెప్పును ? ప్రత్యవయవమును జక్కగా కౌగిలించుకొని మిక్కిలి ప్రేమించును ? నాతో క్రీడించును ?" అని ఆలోచించుచు కలతజెంది యటు నిటు పరికించుచు, పులకించుచు, నీ పేరునే రాధా ! రాధా ! యని కలువరించుచున్నాడు.

మ॥ బిగికౌగిళ్ళను వక్త్రచుంబనములున్-బింబోష్ఠపానంబులున్
రగులుం గోర్కెలు సంభ్రమంబు, సురతారంభంబు,
స్వేదంబునున్
వగలుంగులెక్కుడు గన్నుదామరలు, వా-హ్వాకారముల్గల్గి చ
క్కగ రేలన్దమకించు దంపతుల శృ-ంగారంబు
శ్లాఘ్యంబునా॥ 36

తా॥ ఓ రా ధా ! ఈ కటికి చీకటియందు అనేక దంపతులు విటత్వము నంగీకరించి, పురుషుడు పరకాంత కొఱకును, అతని భార్య పర పురుషుని కొఱకును, నొకరి నొకరికి దెలియకుండ బయలుదేరి, చీకటిలో యేమియు రూపాదులు గనుగొనజాలక స్త్రీ తన సంకేతిత ప్రియుడనియు, పురుషుడు సంకేతితస్త్రీ యనియు దలంచుకొని ఆదిలో నాలింగనములు పిదప చుంబనములు, తరువాత మోవిపానమును గావించి రగులుచున్న కోర్కెలతో తొట్రుపాటున రత్యారంభము గావించి, చెమర్చి రతాంతమున ఆహాకారములు సేయునప్పుడు గొంతు సవ్వడిచే నిజము తెలిసికొని యుభయులు సదోషులగుటచే నొకరి దోషము నొకరు ఎంచక సిగ్గున మెల్లగ తమ తమ స్వస్థానములు జేరు చున్నారు. అట్టి చీకటిలో ఆ దంపతుల శృంగారము నేమనవచ్చును? అన్ని రసములకు ఆకరమని ఆ శృంగార రసమును శ్లాఘింపవచ్చును గూడ.

వి॥ ఆలింగనము సేయుటలో భయస్థాయీ భావమగు భయానక రసమును, ప్రియురాలు వలదు వలదని ప్రక్కకు నొదుగుచుండ ప్రియుడు బలత్కారముచే నధర చుంబనములు చేయుటచే, కరుణరసమును, ఆ కరుణరస మనుభవించు తఱి ప్రోత్సాహము కొఱకై నఖ దంత క్షతాదుల చేయుటచే వీరరసమును, ఇట్టి సాధనసంపత్తి గలిగినప్పుడు నాయికా నాయకులు ఆహాకారములు సేయునపుడు అద్భుత రసమును, ఇట్లు మన్మథోద్భావము గలుగగా నానా విలాసములను బట్టి హాస్య రసమును నుద్భవించును. నాయికానాయకులకు పై జెప్పిన రసము లన్నియు లజ్జారూపములై యుండును.

అవ॥ ఇపుడు రాధా ప్రాప్తియే శ్రీకృష్ణుని సర్వస్వమని కృష్ణోత్కంఠను వర్ణించుచు రాధను చెలికత్తియ త్వరపెట్టుచున్నది.

ఉ॥ కంతు వసంత బాధలకు - కంజదళాక్షుడు తాళజాలకా
ధ్వాంతములోన నీకొఱకు - దారులుజూచుచు భీతిజెంది, గు
ల్మాంతరమందు నిల్చుచు సు-ఖాంతముగా నటు లభ్యమైన ఏ
కాంతమునందు నీముఖము-గాంచుచు కాంత !
కృతార్థుడయ్యెడిన్॥ 37

కంతు = మన్మథుడు, ధ్వాంతము = చీకటి.

తా॥ ఓ రాధా! వసంత మన్మథబాధలకు తాళలేక శ్రీకృష్ణుడు చీకటిలో భయపడుచు నీకొఱకు దారులు జూచుచు నొకవేళ నీవు వచ్చితివేమో యని పొదలలో జూచుచు నిలుచుచు నుండును. నీవు రాత్రికి నుచితమైన వేషమును ధరించి ఎట్లెట్లో ఏకాంతస్థళమున శ్రీకృష్ణుని కలిసికొనుము. నీముఖము జూడగనే కృష్ణుడు కృతార్థుడగును గాక.

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహా కావ్యమునందు పంచమ సర్గము.

# షష్ట సర్గము

అవ॥ ఇపుడు రాధ వియోగదుఃఖముచేత బడలిపోయి యటు నిటు గదలుటకు శక్తిలేక కృష్ణునిపై ననురాగ భరితయై యుండగా, దూతిక యాపె నొకానొక పొదరింటియందే యుంచి శ్రీకృష్ణునికడ కేగి యామె చేష్టల నన్నింటిని దెలుపుచున్నది.

గీ॥ పూల పొదరింట నిలుచుండి – పోవ శక్తి
లేక, చిరమనురక్తయౌ – లేమగాంచి,
వేగ మనసిజమందు గో – విందు దరికి
చెలియ చనుదెంచి, నమ్రయై – పలికెనిట్లు॥ 38

తా॥ అంత నారాధ శ్రీకృష్ణుని సమీపమునకు బోవ శక్తిలేక నొక పొదరింటిలోనుండి, యందే క్రీడింపవలయుననెడి యనురాగముతో నుండగా, నా వృత్తాంతము నెఱింగి యారాధ చెలికత్తియ కామ వికారములచే మాంద్యము నొందియున్న గోవిందు దరికి జేరి వినయముగా రాధ వృత్తాంతమును సవిస్తరముగా నిట్లు చెప్ప దొడంగెను.

అవ॥ ఆ సఖి వాక్యములను గీత రూపమున నిరూపించుచున్నాడు.

## 12వ అష్టపది

పల్లవి॥ నాథ హరీ! జగన్నాథ హరీ!
పూపొద బాధతో నున్నది రాధ ॥నాథ॥

1) ఏకతమున తన మోవిని తేనెలు
గ్రోలెడు నీకై వేచియు నున్నది ॥నాథ॥

2) నీదరి జేరెడు ఆశతో త్వరగను
నడుగులు నిడుచును తడబడుచున్నది ॥నాథ॥

3) లే దామర తోరములతో నీ రతు
లను మతి దలచుచు బ్రతుకుచునున్నది ॥నాథ॥

4) తనరెడు తొడవులు తొడివియు తానే
హరి యని మనమున ననుకొనుచున్నది ॥నాథ॥

5) అభిసారిక దరి కా హరి యేటికి
రాడని మాటికి బలుకుచు నున్నది ॥నాథ॥

6) నల్లని మబ్బును నల్లని స్వామని
కౌగిలి జేయుచు ముద్దిడుచున్నది ॥నాథ॥

7) వాసకసజ్జయి వదలుచు లజ్జను
నీ జాగునకై పొగులుచు నున్నది ॥నాథ॥

8) యతి జయదేవుల నుతియగు గీతము
రంజిలజేయును రసికుల నిరతము ॥నాథ॥

తా॥ ప॥ శ్రీకృష్ణా! జగన్నాథా! రాధాదేవి యొక పూల పొదరింటిలో జేరి మిక్కిలి మన్మథబాధ నొందుచున్నది.

1) ఏకాంతముగా తన మోవి తేనెలు పానముజేసెడు నీకై నలువంకల జూచుచున్నది.

2) రాధ నీ సమీపమునకు రాదలచి యత్యుత్సాహముతో బయలుదేరి కొన్ని యడుగులు బెట్టి యింతలో నీ విరహ సంతాపముచే నడువ జాలక నేల కూలబడి పోవుచున్నది.

3) కృష్ణా! రాధ మదన సంతాప శమనార్థమై తామరతూడులు చిగురుటాకులు వీని కంకణములుగా ధరించి మునుపనుభవించిన రతివిలాసముల దలంచుకొనుచు మృతిబొందక ప్రాణములను మాత్రము ధరించి యున్నది.

4) రాధ చక్కగా నాభరణముల ధరించికొని "ఇది సురత యోగ్యమగు వేషమగునా! కాదా?" యని మాటిమాటికి జూచుకొనుచున్నది

మరియు స్త్రీయోగ్యములగు నలంకారములు మాని, నీ విరహ దుఃఖ మును బోగొట్టుకొనుటకై పురుషాయిత సురతమునకు యోగ్యమైన యలంకారములను ధరించి తానే నిరూపమునుబొంది నేనే "శ్రీకృష్ణుడ" వని భావించుచు కాలమును గడపుచున్నది.

5) రాధ - "ఓ చెలీ! శ్రీకృష్ణుడు త్వరితముగా సంకేతస్థానములో నున్న అభిసారికనైన నాదరి కేటికి రాలేదని" యడుగుచున్నది.

6) రాధ నీ దరికి రావలయునని పొదరింటినుండి బయలుదేరి ద్వారము నందు మేఘమువలెనున్న గాఢాంధకారమును జూచి భళా శ్రీకృష్ణుడే వచ్చినాడని భావించి యా యంధకారమును కౌగిలించి ముద్దిడుచున్నది.

7) రాధ సంకేత స్థానమునందు రతి లీలోపకరణములన్నియు ధరించి యాయత్తురాలై నీవచ్చుటకు వచ్చుట కాలస్యముసేయగా లజ్జను వీడి మిక్కిలి విలపించుచున్నది.

8) శ్రీ యతి జయదేవుల శ్రీసూక్తులు శృంగారరసాస్వాదన పూర్వకముగా భగవద్భక్తిరూపరసము ననుభవించు భాగవతోత్తములకు మిక్కిలి సంతోషమును కలుగజేయును గాక.

అవ॥ ఇపుడు రాధ శ్రీకృష్ణైకపరురాలై యున్నదని చెప్పుచున్నది.

ఉ॥ తోరముగా గగుర్పొడుపు - తోరపుమేనున సంభవింప, సీ
త్కార వికారరావములు - తత్తఱపాటున వెల్వరింప, శృం
గార రసాబ్ధిమగ్నయయి - గాసిలి, నిత్యము ధ్యానలగ్నయై
మారదవాగ్నితప్తయగు - మానసఖిం గాంచవదేల వంచకా॥ 39

తోరముగా = అధికముగా; తోరపు మేనున = అందమైన శరీరమందు

తా॥ ఓ ధూర్తుడా! కృష్ణా! నీవు రాధకడకు రానందున, నామె నిన్ను ధ్యానవశముచే సమీపవర్తిగా జేసికొని, నీవు సంభోగ వ్యాపారముల నొనర్చుచున్నట్లు తలంపగా శరీరమంతయు గగుర్పొడువగా,

సీత్కారముల నొనర్చుచు, నానందవశమున శరీరము జడప్రాయమైపోగా నొడలు తెలియక వికారస్వరమున నేమేమో పలుకుచూ( కామవికారములను జేయుచు నానందరససముద్రములో మునిగియున్నది. అట్టి రాధను జూడ రావేలనయ్యా !

అవ॥ ఇపుడు చెలికత్తియ శ్రీకృష్ణుని త్వరపెట్టుటకై ఓకృష్ణా! రాధ ధ్యానవశమున నీతో రమించుచున్నదయ్యును, ప్రత్యక్షముగా నిన్ను కనుగొన జాలక యేమియు సుఖమొందుట లేదని చెప్పుచున్నది.

మ॥ అలరన్ భూషణముల్ధరించు మెయి, ఆ-కల్లాడ శంకించు రా
కలునీవంచు, రచించు పాన్పులను, శృం-గారించిధ్యానించు ని
చ్చలు, నాకల్ప వికల్ప తల్ప రచనా - సంకల్ప లీలా శతం
బుల రేలన్ వెడలింపగా గలుగునే-పూబోడి నిన్వీడియున్? 40

ఆకల్పము = వస్త్రాద్యలంకరణము; వికల్పము = భ్రాంతి, శంక; సంకల్పము = మనోవ్యాపారము, ధ్యానము.

తా॥ ఓ కృష్ణా! మనోహరాంగియగు రాధ, నీవు సమీపమున లేకుండుటచే విరహతప్తురాలై కాలయాపనము కొఱకు శరీరమునం దాభరణములను నలంకరించుకొనుచున్నది. చెట్ల యాకులు కదలిన నీవు వచ్చుచున్నావని మాటిమాటికి శంకించుచున్నది. పూలపాన్పును రచించుచున్నది. పరమోత్కంఠచే మనమున నిన్నే ధ్యానించుచున్నది. అట్టి యలంకారములు శంకలు శయ్యారచనలు ధ్యానములు వందలుగా నొనర్చినను, నీవు దగ్గఱ లేనందున రాత్రిని గడుపలేకున్నది,

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహా కావ్యమునందు షష్ఠ సర్గము.

# సప్తమ సర్గము

అవ॥ ఇపుడు మానవతుల యభిమానమును ఖండించుటకు ఖడ్గప్రాయమగు చంద్రోదయ వర్ణనమును జేయుచున్నాడు,

గీ॥ అంతఁ జారిణీకాంతా స - మాగమమున,
సంకలిత పాతకమన, క - ళంక కాంతి
గలిగి, దిక్సుందరీవక్త్ర - గంధ బిందు
వన. మృగాంకుండు శోభిల్లె - వనమునందు॥ 41

తా॥ ఇంతలో [చెలియ రాధా వృత్తాంతమును జెప్పుచుండగనే] జారస్త్రీల మార్గము నడ్డగించుటచే గలిగిన పాపకళంకమోయనగ నల్లని మచ్చ యెల్లరకును దెలియుచుండగా, తూర్పుదిక్కను పడంతి మొగముమీది గంధపుబొట్టో యనంగ ప్రకాశించుచు, చంద్రుడు బృందావనము నంతయు నెంతయో వెలిగింపజేసెను,

అవ॥ ఇపుడు కృష్ణ వియోగ పీడిత యగు రాధ విరహదుఃఖమును వర్ణించు చున్నాడు.

ఆ॥ వె॥ అంబరమున చంద్ర - బింబంబు వెలుగంగ,
హరి విలంబనమును - నాచరింప,
దుఃఖ జలధి మగ్న - తోయజదళనేత్రి
రాధ, యధిక మధుర - బాధనొందె॥ 42

తా॥ ఆ రాధ, చంద్రబింబము సరసర నుదయించుటకును, కృష్ణుడు వేగిరముగ రాక యాలస్యము చేయుచుండుటకును, మిగుల దుఃఖము నొంది, యయ్యో యని విలపించుచు, నెంతయో సంతాపమునొందెను,

వి॥ చంద్రోదయమైనచో, నభిసారికలు యథేష్టముగా సంచరించుటకు వీలు

లేనందున, శ్రీకృష్ణుని కడకు వెళ్ళ వలనుపడదని, రాధ సంతాపము నొందెను.

అవ॥ ఆ రాధ విలాపమునే గీత రూపమున వర్ణించుచున్నాడు.

# 13వ అష్టపది

పల్లవి॥ ఎవని శరణము వేడవలయును నేను నిక్కడ
ముదిత పలుకుల మోసపోయిన ముగ్ధ నక్కట॥

1) నన్ను జేరగ వెన్నుడిట రా – కున్న వాడకటన్న వేళకు
నాదు ప్రాయము నాదురూపము–నాదుయత్నము
వ్యర్థమయ్యెను ॥ఎవని॥

2) ఎవనికొఱకై రాతిరంతయు – వెతకినానీ వనమునంతట
వానికతమున నాదు హృదయము – వలపుటలుగుల
వ్రచ్చివైచెను ॥ఎవని॥

3) విఫలమొందిన నేను నిచ్చట – విరహవహ్నిని నెట్లు సైతును
అందుచేతను నన్నివిధముల – నాకు మరణమె
శరణమౌ గద ॥ఎవని॥

4) పుణ్యవతియౌ పొలతియెవతో – పురుషసింహునిబొందుచుండును
నవవసంతపు రాత్రి నన్నిల – నవయజేయుచు
నున్నదకటా ॥ఎవని॥

5) వేణులోలుని విరహవేదన – వేగజాలని విప్రలబ్ధను
రమణ రంజిలు రవల రవణము – లును విరక్తిగ
నాకు దోచెను ॥ఎవని॥

6) గళమునందలి పూలదండలు – నతివిరుద్ధముగాను మన్మథ
లీలచే సుకుమారియౌ నా – తనువునంత దహింపు
చున్నవి ॥ఎవని॥

7) అల్లిబిల్లిగ నల్లుకున్నా – పూలపొదలో వేచియుంటిని
నల్లనయ్యగు నన్ను జేరగ-వలెనటంచును జ్ఞప్తి లేదులె ॥ఎవని॥

8) శ్రీహరి చరణ శరణ యతి జయ-దేవ కవితా గానభారతి
కళలు గలిగిన కాంతకై వడి – స్వాంతమును రంజించు
గావుత ॥ఎవని॥

తా॥ ప॥ ఆసఖి మాటలను విని మోసపోయిన మూర్ఖురాలను. నేనీ వనములో నెవ్వరిని శరణుజొత్తును ?

1) శ్రీకృష్ణుడు నే జెప్పిపంపిన సమయమునకు సైతము బృందావనమునకు రాకున్నాడు. అతనితో విహరింపకున్న నా యౌవనమేల? నాసౌందర్యమేల? నే వేచియున్న నా ప్రయత్నమంతయు వ్యర్థమయ్యెను గదా !

2) నేను కృష్ణునికై రాత్రికాలములో దుర్గమమగు నరణ్యమునందు సైతము వెదకి వెదకి వేసారితిని. ఆ శ్రీకృష్ణుడే యిప్పుడు, నా హృదయమును మన్మథ శరవిద్ధమగునట్లు చేసినాడు కదా !

3) అయ్యో ! శ్రీకృష్ణుడు లేనందున వ్యర్థమగు నీ సంకేతస్థానమునందు మిక్కిలి యచేతనురాలనై, విరహాగ్ని నెట్లు సహింపగలను. ఇంతకన్న మరణమే శ్రేయమని తలంచుచున్నాను.

4) మనోహరమగు నీ వసంతరాత్రులు మందభాగ్యనగు నన్నెంతయో బాధ పెట్టుచున్నవి. ఎవతెయో పుణ్యకార్యములు చేసిన కాముకురాలు శ్రీకృష్ణునితో శృంగారకేళుల ననుభవించుచున్నది. అయ్యో ! నేనేమి సేయుదును.

5) శ్రీకృష్ణుని విరహాగ్నిచే నా హృదయము దహింపబడగా నీ కంకణములు మొదలగు రవ్వలనగలు ధరించుటవలన నేమియు ప్రయోజనము లేదని దలంచుచున్నాను.

6) నా కంఠమునందలంకరణార్థమై ధరించిన పుష్పమాలికలు సైతము, మిక్కిలి విషమస్వభావముగల మన్మథబాణములవలెనే నా హృదయము లోపల ప్రవేశించి, పుష్పముకన్న కోమలమగు నాశరీరము నంతయు మిక్కిలి బాధించుచున్నవి.

7) నేను విరహోద్దీపములగు పూలపొదలను గూడ లెక్కింపక యిక్కడనే నివసించియున్నాను. కానీ కృష్ణుడో నన్ను మనములోనైన దలంప కున్నాడు. నాదరికి వచ్చెదనన్న మాటలు తనకు గుఱుతున్నట్లు లేదు.

8) మిక్కిలి మృదుపదములు గల్గి విచిత్ర కళాశోభితములైన, శ్రీకృష్ణుని భక్తులగు శ్రీ యతి జయదేవుల కవితాగానవాక్కులు. కోమలాంగములు గల్గి యరువదినాలుగు కళలునేర్చిన జవరాలివలెను హరిభక్తుల హృద యములను నలరింపజేయును గాక.

అవ॥ రాధ, శ్రీకృష్ణుడు తన సమీపమునకు రాకుండుటకు తన మనమున దలచిన కొన్ని కారణములను వితర్కించుచున్నది.

శా॥ కుందుండేలనొ మంజువంజుల లతా – కుంజమ్ము నంజేర, డే
సౌందర్యాంగన పొందుకై చనియెనో ? – చంచత్కళాకేళికిన్
విందుల్బిల్వగ నేగెనో ? యిరులలో – విచ్చేయ, కాంతార సీ
మం దానెక్కడ జిక్కెనో ? కలతతో-మార్గంబు నే తప్పెనో ? 43

కుందుడు = కృష్ణుడు.

తా॥ నా మనోహరుడు, మనోహరమగు నీ సంకేతస్థానమునకు వచ్చునట్లుగా జేసెదనని నా చెలికత్తె వెడలి చెప్పియుండును. చెప్పినను నేల రాకున్నాడు. కారణమేమో తెలియదు కదా ? విరహతప్తురాలగు నన్ను వదలి మఱియొక సౌందర్యవతిని తగులుకొనిపోయెనా ? యేమి ? లేక నిచ్చటికి వచ్చుచుండగా మార్గమధ్యమున తన బంధుజనులతో నాటలాడుకొనుచుండెనా ? లేక నీ యంధకారమునందు సంకేతస్థాన మును గనుగొనజాలక నీ వనసమీపములో తానెక్కడ జిక్కుకొనెనో?

లేక విరహముచే నెంతయు భిన్నుడై దారితప్పిపోయెనో యేమో తెలియ కున్నది.

వి॥ ఈ పద్యమునందు, ప్రియుడు సంకేతమునకు రాలేదని విచారించు చున్నందున నాయిక ఉత్కంఠిక.

అవ॥ ఇపుడు సఖీ విషాదమును జూచి శ్రీకృష్ణు డన్యాసక్తుడయ్యెనని యూహించి రాధ పలుకుచున్నది.

ఉత్సాహ

పిదప కృష్ణసహితగాక - భీతితోడ మూకయౌ
సుదతి రాగ, రాధ గాంచి - చోద్యమంది శంకచే
యదుకులాగ్రగణ్యుడొక్క - హంసయానతో రమిం
పఁ దయచేసినాడటంచు - పల్కెనిట్లు బాధతో॥ 44

తా॥ తరువాత రాధ చెలికత్తియ శ్రీకృష్ణుని సమీపమునుండి ఒంటరిగావచ్చి విషాదముతో నేమియు పలుకనందున, రాధ యనుమానించి "ఓహో శ్రీకృష్ణుడన్యాసక్తుడై యుండవచ్చును. లేకున్న నీచెలికత్తె యిట్లు విషాదము నొందుటకు కారణమేమున్నది" యని యూహించి యీ సంగతి యంతయు తాను జూచినదివలె నటించుచు నీ ప్రకారముగా జెప్ప నారంభించెను.

# 14వ అష్టపది

పల్లవి॥ ఏ పుణ్యవతో గోవిందునితో కులుకుచునుండును సత్యమిదే-
సఖి ! కులుకుచు నుండును సత్యమిది.

1) రతులకు ననువగు వేషము వేసియు
కురులును వదలగ విరులును చెదరగ ॥ఏ॥

2) హరి కౌగిలిలో హాయిగ మురియగ
చాచుల సరములు చకచక కదలగ ॥ఏ॥

3) నెలమోమున నెఱి కురులును ముసరగ
ఆహరి మోవుల గ్రోలగ నలయగ ॥ఏ॥

4) చెంపల కెంపుల పోగులు నూగగ
మొలలో నూలును మొఱమొఱ మ్రోయగ ॥ఏ॥

5) ప్రియుడును జూడగ సిగ్గులు మ్రొగ్గిడ
రాగరసంబున రవ పలుకులతో ॥ఏ॥

6) విరిసీ విరియని కనుదామరలలో
మరుడును వెలుగగ పులకలు సెలగగ ॥ఏ॥

7) తనువున చెమటలు తళతళలాడగ
ఉరురతి నలసియు నురమున వ్రాలుచు ॥ఏ॥

8) యతి జయదేవ ఫణిత హరి చరితము
కలి కలుషంబును బాపును సతతము ॥ఏ॥

తా॥ 1) ఏ పుణ్యముజేసిన యువతియో రతులకు యోగ్యమగు వేషమును వేసికొని తన సౌందర్యాదిగుణమువలన కృష్ణుని లోబఱచుకొని కొప్పు వీడి యందుండి పువ్వులు జలజలరాలునట్లు విపరీతసురతము నొనరించుచు శ్రీకృష్ణునితో శృంగారవిలాసముల ననుభవించుచున్నది.

2) మరియు నా జవరాలు శ్రీకృష్ణుని గట్టిగా గౌగిలించుకొని నానావిధములగు కామవికారముల నొందుచు గిండ్లవంటి పాలిండ్లపై హారములు తాండవమాడుచుండగా పురుషాయితము నొనర్చుచు కృష్ణునితో గ్రీడించుచున్నది.

3) ముఖచంద్రునియందు ముంగురులు మనోహరముగ తాండవమాడుచుండ ఆ జవరాలు శ్రీకృష్ణుని యధరామృతమును బానము సేయగా, శ్రీకృష్ణుడు ఆ జవరాలి యధరామృతమును బానముజేయగా సంతోషాతిశయముచే కనులు మూతలుబడుచుండ శ్రీకృష్ణునితో నలసిపోవునట్లు రమించుచున్నది.

ువతి రతివేగముచే రతనాలకమ్మలు ఎగిరెగిరి చెక్కిళ్ళను గొట్టు
ుండగా మొలనూలు మణులు గణగణ మ్రోగుచుండగా ఘన
ంమును విచిత్రముగా త్రిప్పుచూ నతిచంచలురాలై కృష్ణునితో
హాయితము నొనర్చుచున్నది.

కావని, స్త్రీవలె క్రింద బరుండియున్న ప్రియునిజూచి నవ్వుచు,
పురుషునివలె తను సంచరించుచున్నందులకు లజ్జించుచూ, లేక
షునివలె విజృంభించుచున్న తన్ను బ్రియుడు చూడగా సిగ్గునొంది
నవ్వులు రువ్వుచు, ననేకవిధముల రతికూజితముల నొనర్చుచూ
'దానందముతో కృష్ణునితో క్రీడించుచున్నది

ువతి యరవిరిసిన కనుదామరలతో వెలుగొందుచు నానందాతిశయ
రోమాంచములు నిక్కపొడుచుకొనగా మన్మథ వికారముల
డుచు శ్రీకృష్ణునితో గ్రీడించుచున్నది.

జవ్వని సంభోగక్రియలయందు మిక్కిలి నేర్పును బ్రదర్శించి
ాసము వలన గలిగిన చెమటబిందువులు శరీరమునకెంతయు
ను గలిగింప నలసి సొలసి శ్రీకృష్ణుని యురమున బరుండియున్నది.

ఇందు సురతావసానము సూచింపబడినది,

"అంగే స్వేదః శ్లథత్వంచ కేశవస్త్రాది సంస్మృతిః
జాతే చ్యుతి ముఖే నార్యా విరామేచ్ఛాచ జాయతే"

ృష్ణుని విపరీత సురతమును వర్ణించు శ్రీ యతి జయదేవుల గీతము
కల్మషములను నిరంతరము హరించును గాక.

డు రాధ విరహపీడితయై యా చంద్రుడుగూడ బాధించుచున్నాడని
ుచున్నది.

అధిక విరహ పాండు - రాబ్జముఖ మురారి
కాంతితోడ వ్యథను - సుంత బాపి,
యలరువిల్తు ననుగు - చెలియౌచు జాబిల్లి
మరల విస్తరించు - మదనుబాధ॥ 45

తా॥ ఓ చెలియా! యీ చంద్రుడు నాప్రియుని విరహపాండురమగు ముఖము వంటి తెల్లని ముఖముగల్గిన వాడగుటవలన నా వియోగదుఃఖమును కొంతవరకు బోగొట్టుచున్న వాడయ్యెను, [నాకు విరోధియగు] మన్మథునకు చెలికాడగుటవలన నాపై చలముపూని బాధించుచున్నాడు.

అవ॥ పూర్వగీతమునందొకానొక యువతి శ్రీకృష్ణునితో ననుభవించిన విపరీత సురతము వర్ణింపబడినది. ఈగీతమునందొకానొక స్వాధీనభర్తృకతో గూడి కృష్ణుడనుభవించిన విలాసములను రాధ వర్ణించుచున్నది.

# 15వ అష్టపది

పల్లవి॥ యమునా పులినవనమ్మున యశోద తనయుడు
రతులను దేలుచు నున్నాడే॥

1) హద్దులు నెఱుగక ముద్దులనొసగెడు – ముద్దియమోమను నెలలో
మృగమన మురువుగ మృగమద తిలకము – దిద్దుచు
నున్నాడే ॥యమునా॥

2) ప్రణయిని ప్రాయపు వదనము గనుగొని-మొయిలుల నల్లని కురులలో
మెఱుపులతెల్లని గోరంటపువ్వుల – తురుముచు
నున్నాడే ॥యమునా॥

3) నెలవంకలకును నెలవగు ఘనమౌ-స్తనయుగ గగనము నందున
చక్కని చుక్కల ముత్తెపుసరముల-సవరిస్తున్నాడే ॥యమునా॥

4) తామర రేకులు నరచేతులగల – కోమలి కోమల బాహుల
మరకత మణిమయ కంకణ మధుకర – నికరము
నిడుచున్నాడే ॥యమునా॥

5) కాముని బంగరుగద్దియ యనదగు-రతిగృహఘనజఘనమ్మున
తోరణ గనినగు తోరపు మణులతో – నూలును
కడుతున్నాడే ॥యమునా॥

6) సిరికిని నెలవౌ యెదపై చివురుల - హజ్జలు గుజ్జిగ నిడగా
కుంకుమ లత్తుక గూర్చిన పారా-ణిని గిలిస్తున్నాడే ॥యమునా॥

7) ఏ కొఱమాలినదానితో వెంగళి-వెన్నుడు వెన్నడి దగులగ
ఈపొదరింటను నొంటిగనుండుట-వ్యర్థముకాదెసఖీ॥యమునా॥

8) శ్రీయతిజయదేవ స్తుత రసమయ - రాసక్రీడల స్మరణం
జనసముదయ విపదంబుధితరణం - జగతిని
కలిమల హరణం ॥యమునా॥

హజ్జ = పాదము; పులినము = ఇసుకదిన్నె; మృగమదము = కస్తూరి,
నెలవంకలు = 1) నఖక్షతములు 2) బాలచంద్రులు.
ఘనము = 1) దిటవుగలది 2) విరివియైనది 3) మబ్బు లేక ఆకాశము
వెంగళి = వెఱ్ఱి; వెన్నుడు = కృష్ణుడు; వెన్నడి = వెంబడి.

తా॥ ప॥ నీ చెలీ! శ్రీకృష్ణుడు నిర్భయముగ నిప్పుడు యమునానది యిసుక తిన్నెలచే రమ్యమగు వనమునందు నొక రమణితో క్రీడించు చున్నాడు.

1) శ్రీకృష్ణుడు ఆ రమణి యధరోష్ఠమును చుంబనమును జేయుచు, శరీర మంతయు గగుర్పాటు నొందుచుండగా కామరసము తాండవమాడు ముఖపద్మమునందు చంద్రునియందు లేడివలె మనోహరముగ నుండు నట్లు కస్తూరితిలకమును దిద్దుచున్నాడు.

2) ఓ చెలీ! శ్రీకృష్ణుడు, దర్శనమాత్రముననే యౌవనవతుల మనస్సుల నాకర్షించుచు మన్మథుడను మృగము దిరుగు నరణ్యమోయన నల్లని మేఘసమూహమువలె ప్రకాశించు తన ప్రియురాలి కొప్పునందు మెఱపు వంటి గోఅంటపువ్వుల నుంచుచున్నాడు.

3) ఓ చెలీ! శ్రీకృష్ణుడు కస్తూరీపంకముయొక్క కాంతిచే వ్యాప్తమై, మిక్కిలి గొప్పవై, నఖక్షతములచే ప్రకాశించుచుండు నా యువతి చనుదోయి యందు కస్తూరివలె నల్లనై యనేక మేఘములు గలిగి బాలచంద్రునితో

నొప్పారు ఆకాశమునందు నక్షత్రమాలికవలె వెలుగునట్లు రతనాల హారము నలంకరించుచున్నాడు.

4) ఓ సఖీ! శ్రీకృష్ణుడు కమలములవంటి యరచేతులు గలిగినదియు, మంచువలె చల్లనై తామరతూడులవలె మిక్కిలి కోమలములగు నా జవరాలి భుజములకు, తుమ్మెదలవంటి గరుడపచ్చల కంకణములను తొడుగుచున్నాడు.

5) సఖీ! శ్రీకృష్ణుడు, మిగుల విశాలమగు నాకృతిగలిగి వశీకరణ ధూపముచే ధూపితమై మన్మథుని బంగారు సింహాసనమువలె ప్రకాశించుచు, ఆనందమునకు నెలవైన లేక యోనితో నలరారుచున్న నా యువతి జఘన ప్రదేశమునందు రతనాల మొలనూలనెడి తోరణమును గట్టుచున్నాడు.

వి॥ జఘనము విస్తీర్ణము నైనదియు, మిక్కిలి గౌరవర్ణము గలదగుటవలన మన్మథుడను మహారాజుయొక్క కనకాసనసామ్యము చెప్పబడినది.

6) శ్రీకృష్ణుడు లక్ష్మికి నిలయమైన తన హృదయమందుంచుకొనబడిన యా యువతి చరణ కిసలయములందు పైపూతగా లత్తుకల పారాణిని వ్రాయుచున్నాడు.

7) ఓ చెలియా! శ్రీకృష్ణుడు విరసుడై నన్ను వదలి వేరొక యువతిని తనకు దగినదానినిగా ధ్యానించుచుండగా ఈ పొదరింటియందు నేను చిరకాలముండియు ప్రయోజనమేమికలదు, నీవే జెప్పుము.

8) శృంగారరసమును జిలుకు, పలుకులు గలిగినదియు, రాసక్రీడలను స్మరింపజేయునదియు, జనుల యాపదలనెడి సముద్రమును దాటింపజేయునదియు, కలిపాపములను హరింపజేయునదియు నగు నీ గీతము-సు శ్రీయతి జయదేవులచే రచింపబడినది.

మ॥ దురపిల్లం బనియేలనో చెలియ! యా - ధూర్తుండు రాడేని, నా
దురదృష్టంబున వల్లవీసతులతో - దోతెంచి క్రీడించెడిన్
పరమోత్కంఠ భరార్త చిత్తమును గో - పాలుండు గొంపోయె, మ
ద్వర సాంగత్యముఁజెంద, నే జనియెదన్ - స్వాస్థ్యంబు
జేకూరగన్. 46

తా॥ ఓ సఖీ! ధూర్తుడగు కృష్ణుడు దయావిహీనుడై యున్నచో రాకుండుటకు నీవేల దుఃఖించెదవు. అతడు ప్రియురాండ్రగు ననేకగోపికలతో నతి యథేష్టముగా క్రీడించుచున్నాడు. దానివలన నవమానము నీకేమి? ఇపుడు నాహృదయముత్కంఠాతిశయము వలన గలిగిన యార్తిభర ముతో గూడగా, దానిని శ్రీహరి హరించెను. నా హృదయతాపము దీరి, స్వస్థత జేకూరుటకై, యాతని బొందుటకు ఇక నేనే జనియెదను.

వి॥ ఇచ్చట రాధ జెప్పు మాటలను బట్టియు, ధూర్తుడు మొదలగు పదము లను ప్రయోగించుటంబట్టియు, ఓదూతీ! నీవేల పరితపించెదవు? అతడు రాకున్న నాకు దుఃఖముగాని నీకేమియు లేదుగదా! కాబట్టి నీ పరితాప మును జూడ, అకృష్ణునితో నీవు సంభోగించి కృతార్థురాలవై యున్నా వనియే తోచుచున్నది. అయినను, కుచోపమర్దనము, గాఢాలింగనము, నఖదంత క్షతములు మున్నగువానిచే నిన్ను మిక్కిలి శ్రమపెట్టి, కృష్ణుడు తన నిర్దయత్వమును గనబఱచినాడని పరితపించెదవు కాబోలు. ఓహో! అతడు ధూర్తుడనియా? ధూర్తుడు గాకున్నచో ననురక్తనగు నన్నువదలి నాసందేశమును చెప్పిన దూతికవగు నీతో నేల రమించును. మఱియు నతనికి పెక్కుమంది ప్రియురాండ్రు గలరు. అట్టివారిలో నీవుగూడ నొకతెవైతివి గదా! ఇపుడు నిన్ననవలసిన పనిలేదు. మరియును కృష్ణుడు నీవంటివారలతో సంభోగించుటయే ప్రధాన కార్య ముగా నెంచుకొని, సంచరించు బహువల్లభుడైనను, నాకేమి నష్టము లేదు. కాని నన్ను ప్రేమించినది మొదలుకొని యన్య యువతిని తన మనమున దలచియైన యెఱుగడు. నేనుసైతమట్లే పరపురుషుని మనమునగూడ దలపకయే యుంటిని. ఇప్పుడన్నచో విధివశమున నాతని విషయమంతయు విపరీతమైనది. నేను బ్రతుకుటకంటె ప్రాణ ములు వదలుటయే శ్రేయమని తలంచుచున్నాను.

అవ॥ ఇప్పుడు కృష్ణునితో రమించు యువతియొక్క సౌభాగ్య సుఖములను, కృష్ణుని విరహముచేఁ బరితపించు యువతియొక్క సంతాపమును గీత రూపముగా వర్ణించుచున్నాడు.

# 16వ అష్టపది

పల్లవి॥ హరికేళుల దేలిన పొలతుక సఖి
శ్రీహరి కేళుల దేలిన పొలతుక

1) మెత్తని చివురుల పడకకు జడియదు
కరువలి కదలే కలువల కన్నుల ॥శ్రీహరి॥

2) కమ్మని విలుతుని యమ్ముల కులుకదు
విరిసిన తామరమోమును గలిగిన ॥శ్రీహరి॥

3) గంధపు పూతల తాపము నొందదు
మృదు మధురములగు పలుకులు బలికెడు ॥శ్రీహరి॥

4) కలువలరాయుని కాంతికి కలుగదు,
పద్మముబోలిన పదముల కరముల ॥శ్రీహరి॥

5) విరహము చేతను వెతలను జెందదు
మొయిలుల నల్లని తనువున దనరిన ॥శ్రీహరి॥

6) చెలియల పలుకుల ములుకుల కలుగదు,
పచ్చని బంగరు వలువలు గలిగిన ॥శ్రీహరి॥

7) మన్మథ వ్యాధుల బాధల బెదరదు
భువనము లందున పురుషోత్తముడగు ॥శ్రీహరి॥

8) యతి జయదేవులు పలుకు పదంబు
పాడిన విన్నను పరమపదంబు.

కేళులు = 1) క్రీడలు; లళయోరభేదః = 2) కేలులు = చేతులు.
కరువలి = గాలి కమ్మని విలుతుడు = మన్మథుడు,

అవ॥ ఇంతకుముందు రాధ "మద్వరసాంగత్యమునకై నే జనియెదన్" అని

వెలికత్తెతోఁ జెప్పి, యింతలో శ్రీకృష్ణుడు పరస్త్రీసంగతుఁ డయ్యెనని తలఁచి యతనివృత్తాంతము నొక మిషగా పెట్టుకొని కొంత కాలయాపనము జేసి పిదప మన్మథబాధను సహింపజాలక యతనికి సహాయులగు మలయమారుతమును దూఱుట కారంభించుచున్నది.

మ॥ గణుతింతున్ నిను గంధవాహ! యిక నీ-కాఠిన్యము న్మాని, ద
క్షిణ! కారుణ్యముతోడ నన్ను గనుమా! - శ్రీనందనానంద వ
ర్ధన! రప్పింపుమ కృష్ణువైశను; జగ-త్ప్రాణుండవై ప్రాణముల్
గొన న్యాయంబె? ప్రసన్న భావమున నా - కున్మేలు
చేకూర్చుమా! 47

దక్షిణ = 1) దాక్షిణ్యము గలవాడ ! 2) దక్షిణమునుండి ప్రసరించువాడా. శ్రీనందనానంద వర్ధన — శ్రీనందన = లక్ష్మీ కుమారుడైన మన్మథునికి ఆనందవర్ధన = సహాయ మొనరించి ఆనందము గూర్చువాడా! అనగా వాయుదేవుడా యని అర్థము.

తా॥ ఓ మలయానిలుడా ! నీవు లోకములకెల్ల ప్రాణస్వరూపుడ వయ్యును, నాకు విరోధియగు మన్మథునితోఁజేరి యతని సంతోషమునకై విపరీత వృత్తి నవలంబించియున్నావు. ఇంతమాత్రమున నీవు మొనగాడవు గాబోవు. కాన నీ వంకరతనమును మాని, యించుక దయారసమును బూని, దక్షిణుడను నామమును సార్థకము జేసికొని నాకు బ్రసన్నుడవు గమ్ము. నా ప్రియుడగు శ్రీకృష్ణుని తోడ్తెచ్చి నాకడ నిలుపుము. అట్లు చేయవేని నీవు జగత్ప్రాణుడవగుటకు మాఱుగాఁ బ్రాణహరుఁడవే యగుదువు.

అవ॥ ఇపుడు రాధ విరహదుఃఖమున కోర్వజాలక మలయ మారుతాదులను నిందాగర్భముగ ప్రార్థించుచున్నది.

గీ॥ భవనమున కేను జనజాల - భారమయ్యె
బ్రతుకు; భంజింపరార ప్ర - భంజనుండ !
ప్రాణముల హరియింపుమా - పంచబాణ !
తాకవే నను తల్లి ! యం - తకుని చెల్లి ! 48

ప్రభంజనుడు = వాయువు; పంచబాణుడు = మన్మథుడు.
అంతకుని చెల్లి=యముని చెల్లెలు యమునానది. (యమునాశమనస్వసా-)

తా॥ కృష్ణుడు లేకయున్నచో నేను యింటికి పోజాలను. నాకు గృహమును బాధ గలుగజేయును. నా బ్రతుకు భారమైనది, ఓ మలయానిలా! నీవు ప్రభంజనుడవై నన్ను భంజింపుము. ఓ పంచబాణుడా! నీ బాణములతో నా ప్రాణముల దీయుము. ఓ యముని చెల్లెలా! యమునా నదీమతల్లీ! నీ ప్రవాహముచే నన్ను ముంచివేసి నీలో జేర్చుకొనుము.

ఇది శ్రీకృష్ణ సేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహా కావ్యమునందు సప్తమ సర్గము.

# అష్టమ సర్గము

అవ॥ ఇట్లు రాధ కృష్ణ తత్పరయై యత్యంతము విలపించుచుండగా ఆర్త త్రాణ పరాయణుడును జగత్కారణభూతుడునగు శ్రీకృష్ణు డామెయెదుట మనోహరాకారముతోడ నావిర్భవించెను.

చం॥ స్మరశర ఘోరబాధలకు - జాలక రాధిక, రాత్రి నెట్టులో
పురపుర బొక్కి, వేకువన - ముంగిటనిల్చి వినమ్రుడైన శ్రీ
హరి వినయమ్మె సంగ ప్రియ-మారగ మెల్లగబిల్వ, నీర్ష్యతో
జురచుర చూపులంగనుచు - జూకురు హెచ్చగ పల్కె నల్కతో. 49

స్మరుడు = మన్మథుడు; చూకురు = శోకము.

తా॥ మన్మథబాణ బాధలకు తాళజాలక రాత్రి యంతయు దుఃఖించి రాత్రి నెట్టులో గడిపిన రాధ యెదుట ప్రాతఃకాలమున వినమ్రుడైన శ్రీహరి

మెల్లిగ "రాధా" యని ప్రేమతో బిల్వగా నీర్ష్యతో శ్రీకృష్ణుని చురచుర జూచి పెల్లుబికిన శోకముతో రాధ యీలాగున బలికెను.

# 17వ అష్టపది

పల్లవి॥ పోరా కృష్ణా! పోరా మాధవ! మాయలు నాకడ నేలర?
ఏచెలిపై నీకెక్కువ మక్కువో ఆచెలిచెంతకె చనరా॥

1) రాత్రిరిజాగారమున కనుంగవ రక్తోత్పలముల మీఱగ
తెలిసెలె యెటనో నమరక్తుడవై వచ్చితి వంచును
చేరగ ॥పోరా॥

2) మురువగు కన్నుల ముద్దిడ, కాటుకసోకిన యెఱ్ఱని వాతెఱ
నల్లదనంబును నీ తనువున కనురూపంబాయెలె
హరిహరి ॥పోరా॥

3) మరునికలనులో మేనునమెఱచెడు పదనగు గోరుల నొక్కులు
పచ్చల బంగరుపై దగజెక్కిన రతి జయరేఖలో
హరిహరి ॥పోరా॥

4) వెడద యెడద నిడు పడతుల యడుగుల వెడలియు
తడిసిన లత్తుక
వెలికిని గనబడు వెడవిలుఁతుండను – మ్రాకుల చివురులో
హరిహరి ॥పోరా॥

5) నీ యొాడున పలుగాటులుగనుగొని నామది కొందలమొందేను
నీ నా తనువున నిపుడు నభేదము దెలిపె నదేలనో
హరిహరి ॥పోరా॥

6) నీకటి మెయివలె మనసును సైతము మలినంబాయెలె
యెటులన ?

మరుతాపము గను నాశ్రితజనులను వంచనజేసెదు
హరిహరి ॥పో రా॥

7) అబలల గబళించుటకే వనమున నిలుతు వదేమి విచిత్రము ?
తెలుపును పూతన దునిమిన నీదగు నిర్దయ
బాల చరిత్రము ॥పో రా॥

8) యతిజయదేవులు గానముజేసిన ఖండిత రాధిక దుఃఖము
వినుడి సుధామధురంబది విబుధ నిధానము నేని
యలభ్యము ॥పో రా॥

మరుతాపముగను = మరుతాపము బొందు,
కృష్ణ = 1) ఇనుము 2) మలినము (1) ఇనుమువలె కఠినుడా యని
2) మనసులో కల్మషముగలవాడా యని
మాధవ = 1) మారమా మంగళదేవతా (అమ) అనగా లక్ష్మీపతియని.
మా = మాయొక్క, ధవా = భర్తా అనగా భలే మగనివి యని.

తా॥ ప॥ ఓ కృష్ణా! మాధవా! పో పొమ్ము. "నీవు తప్ప నాకెవ్వరు ప్రియురాండ్రు లేరు" అను మాయమాటలు మానుము. నీకేవెలిపైని వలపుగలదో యాచెలిదగ్గఱకే పొమ్ము. నాచెంతకు రావలదు.

అవ॥ "నీకన్న నాకు వేరే ప్రియురాలు లేదే" యని యందువేమో చెప్పెద నసు వినుమనుచున్నది.

1) కృష్ణా! రాత్రియందు మిగల జాగరణము జేసినందున నెఱ్ఱబడిన శృంగారరసమునందు పట్టుదల గలిగి మూతలుబడు నీ కనులను జూచి నంతనే యేదోయొక యువతియందనురాగము [వలపు-ప్రేమ] గలిగి యున్నావని స్పష్టముగా తెలియుచున్నది.

అవ॥ "ఓ రాధా ! నీవు గనబడక రాత్రియంత వనమెల్ల వెదకినందున నిద్ర లేక నెఱ్ఱబడినవిగాని యితర యువతి కొఱకు రాత్రి జాగారము చేసి కాదు" అనిపచో చెప్పుచున్నది.

2) కృష్ణా ! కాటుకచే మలినములగు నాయువతి కనులను ముద్దాడుటవలన నల్లనైన నీ యధరోష్ఠము నీ శరీరమునకు దగినకాంతిని కలుగజేయు చున్నది.

[నేత్ర చుంబనము – గుహ్యే నేత్రే లలాటేచ చుంబనమ్ పరికీర్తనమ్]

3) శ్రీకృష్ణా ! నీ శరీరము ఘోరమగు మన్మథ యుద్ధమునందు దగిలిన వాడిగోళ్ళ గాయములచే నెఱ్ఱని రేఖలు గలదై మరకతమణి తునకపై జెక్కబడి బంగారుగీతలు గలదై మన్మథయుద్ధమునందు సంపాదించిన జయరేఖను బోలుచున్నది.

4) ఓ కృష్ణా ! విశాలమగు నీ వక్షస్థలమున, నితర యువతి పాదకమలము లందలి లత్తుక యంటియున్నందున, లోపలనున్న మన్మథుడను వృక్షముయొక్క లేత చిగురుటాకులు వెలుపలికి గనుబడుచున్నవో యనునట్లున్నది,

5) కృష్ణా ! నీ పెదవియందలి దంతక్షతములు నాహృదయము నెంతయో బాధించుచున్నవి. ఏమి యీ విచిత్రము – ఈ వియోగకాలమున గూడ నీ శరీరము నాశరీరముతో నభేదమునే తెలియుజేయుచున్నదే - ఇది ఎట్లో గదా !

అవ॥ "రాధా నీకై పద్మములను కొని తేబోగా తుమ్మెద పెదవిన గఱచినది కాని దంతక్షతము కాదు" అనిన చెప్పుచున్నది.

6) ఓ శ్రీకృష్ణా ! నీ శరీరమెట్లు మలినమో యట్లే నీమనస్సుగూడ మలిన తరమై యున్నది. ఏల యన ? మన్మథజ్వరముచే నెంతయు బరితపించ నాశ్రితజనమునే వంచన జేయుచున్నావు గదా !

7) కృష్ణా! నీ వీ బృందావనమున నబలుల కబళించుటకే తిరుగుచున్నావు కాని వేరు గాదు. స్త్రీ వధయందు నిర్దయుడవై ప్రవర్తించిన నీ బాల చరిత్రమును పూతన గాథయే వెల్లడించుచున్నది కదా!

[బాలుడవై యట్టి ప్రబలయగు పూతననే కబళింపగా నిక ప్రౌఢుడవై యబలులమగు మావంటివారిని కబళించుట యేమి వింతయని భావము.]

8) ఓ విబుధ వరులారా! అమృతమువలె మధురమై, స్వర్గమునందు సైతము దుర్లభమైయుండు శ్రీయతి జయదేవులచే వర్ణితమగు రతివంచితు రాలైన ఖండితానాయిక యీరాధ విలాపమును వినుడు.

ఖండితః – నాయకుడు, రాత్రి మఱియొకదాని యింటికి బోయి, యా చిహ్నములతో రాగా జూచి కోపమునొందిన నాయిక.

అవ॥ ఇట్లు రాధ ఖండిత యయ్యును ప్రౌఢత్వ మవలంబించి శ్రీకృష్ణు నాక్షేపించుచున్నది.

చం॥ ప్రణయిని పాదపద్మముల – లత్తుకయంటి, ప్రగాఢరాగమే
తొనకుచునున్నదో యనగ – దోచెడు, నీయెడదంగనుంగొనన్,
ఘనమగు ప్రేమబంధమును – గంగనుగల్పినయట్టి నిన్ను జూ
చిన, వగకన్న మిన్నగు – సిగ్గు జనించెను నాకు
వంచకా! ౯౦

తా॥ ఓ వంచకాగ్రేసరుడా! ప్రియురాలి పాదములందలి లత్తుక యంటుకొని యనురాగమే బయటికి దొనకుచున్నదో యనగ, నెఱ్ఱనిరంగుగల నీ హృదయమును జూచుచుండగా నాకు నీదర్శనము జగత్ప్రసిద్ధమగు మన ప్రేమను గంగలో గల్పినదై (అన్యస్త్రీతో గూడినవాడగుటవలన) దుఃఖమునకన్న చెప్ప నలవిగాని సిగ్గును గల్గించుచున్నది.

వి॥ ఇంతకు ముందు రాధ, "శ్రీకృష్ణుడు నాపై నత్యంతానురక్తుడు గదా" యను గర్వముతో నెవ్వతెను లెక్కసేయక యుండినది. అట్టి మానవతి

యగు దీనియెదుట, నితర నాయికాసంగము చిహ్నములతో వచ్చి నిలిచిన, కృష్ణునియొక్క ప్రియురాలి కాలి లత్తుకయంటిన వక్షస్థలమును జూచుచు గూడ నీరాధ యింకను జీవించియున్నదే” యని పరసతులు పరిహాసము చేయుదురను శంకచే దుఃఖమునకన్న నధికమగు లజ్జ గలుగుచున్నదని భావము.

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీతగోవింద మహాకావ్యమునందు అష్టమ సర్గము.

# నవమ సర్గము

అవ॥ ఇక చెలికత్తియ, ప్రణయకోపముచే కలహాంతరితయై, పరితపించుచున్న రాధను గుఱించి యిట్లు చెప్పుచున్నది.

కం॥ అతి మదనానలఖిన్నను,
రతివశభిన్నను, విషాద - రస సంపన్నన్,
నుత దామోదర చరితను,
నితాంత కలహాంతరితను - నెచ్చెలి పలికెన్. 51

వశ = ఇచ్ఛ.

తా॥ అటు పిమ్మట, రాధ మన్మథబాధచే మిగుల దుఃఖించుచు, సంభోగాభిలాషము తీరక పరితపించుచు, శ్రీకృష్ణుని చరిత్రమునే యనవరతము ధ్యానించుచు నుండగ నామె చెలికత్తియ యేతెంచి యిట్లు పలికెను.

వి॥ ప్రియుని ప్రణయ కోపముచే ననేకవిధముల బెక్కు పలుకుల దిరస్కరించి పలికి, తరువాత మన్మథాగ్నివలనఁ బరితపించుచు బశ్చాత్తాపము నొంది, కన్నీరు గార్చుచుండు నాయిక కలహాంతరిత యనబడును.

అవ॥ ఆసఖి వాక్యములనే గీత రూపమున జెప్పుచున్నాడు.

# 18వ అష్టపది

పల్లవి. మానిని కోపము మానవె హరిపై

1] మధుపవనమున రమాపతి వచ్చెను
అధికానందము గలదే నెలవున ॥మానిని॥

2] తాళఫలమ్ముల మీరిన రసమయ
కుచ కలశమ్ముల వమ్మును జేయకె ॥మానిని॥

3] అందాలొలికెడు హరి పీడకుమని
మరిమరి నుడివితి పడతిరొ మఱువకె ॥మానిని॥

4] కళలు దొలఁగియు కలత వహింపకె
హేళన జేతురు నీ చెలులందఱు ॥మానిని॥

5] మెత్తని తామర రేకుల పొన్పన
కన్నని కనవే కనుల పండువుగ ॥మానిని॥

6] మదిలో నెందుకె కొందల మొందెదు
భేదమెఱుంగక నుడివితి వినవే ॥మానిని॥

7] శ్రీహరి సరసకు జేరును, తీయగ
బలుకును, వృధగా బొగులగ నేలనె ॥మానిని॥

8] యతి జయదేవ ఫణిత హరి చరితము
రసికుల కలరును గూర్చును నిరతము ॥మానిని॥

తా॥ 1) ఓ మానవతీ! [వెఱ్ఱికోపము గలదానా] శ్రియఃపతిపై నూరక కోపింపకుము. అతడు మెల్లని వసంతవాయువు వీచుచుండగా నీ సంకేతస్థానమునకు వచ్చియున్నాడు. ఓ చెలియా నీకు ఇంటిలో నింతకన్న వేరొక అధికసుఖమేమి గలదు ?

2) ఓ మానినీ! తాటిపండ్లకన్న మిగుల గొప్పవియై శృంగార రసమున కాటపట్టులై వెలుంగు నీ కుచకుంభముల నేల వ్యర్థము జేసెదవు ?

(కుండ నీటిచే పరిపూర్ణమగునట్లు స్తనములు కర మర్దనచేగాని శృంగారరసముప్పొంగి పరిపూర్ణత వహింపవనుట.)

3) ఓ మానినీ! అతిమనోహరుడగు శ్రీకృష్ణుని విడనాడకుము. ఈ మాట ఇంతకుముందెన్నిమారులో నీకు ప్రతిస్థలమునందును జెప్పియున్నాను. దానిని మఱువకుము.

4) ఓ మా ని నీ! కళావిహీనురాలవై యేల యేడ్చెదవు? నిన్ను జూచి నీ చెలికత్తియలందఱు పరిహాసము జేయుచున్నారుకదా?

5) ఓ మానినీ! ఉదకబిందువులతో గూడిన చల్లని తామరరేకుల పాన్పునందు బరుండిన శ్రీకృష్ణుని సేవింపుము. నీ కనులను సార్థకపఱచుకొనుము.

6) ఓ మానినీ! నీ హృదయమునందేల మిక్కిలి దుఃఖమును బొందుచున్నావు? నేను భేదములేక చెప్పుచున్నాను, నామాట వినుము.

7) ఓ మానినీ! కృష్ణుడు నీ సమీపమునకు రాగలడు. నీతో నతి మనోహరముగ మాటలాడగలడు. ఏల మనమున నూరక దుఃఖించెదవు?

8) శ్రీయతి జయదేవ కవులచే విరచితమై యతి మనోహరమగు నీ కృష్ణ చరిత్రము శృంగారరసికుల కానందము గలిగించును గాక.

అవ॥ చెలికత్తియ రాధయొక్క దుశ్చేష్టల ననువదించుచు నామెను మందలించుచున్నది.

చం॥ హరి దరిజేరరాఁ విముఖు - రాలవునై, ప్రణమిల్ల మూకవై,
సరసుడుగాగ ద్వేషివయి, - సల్ప్రితిపో విపరీతకృత్యముల్
గరకరి, కాలకూటముగ - గంధము, చండమయూఖలీల చం
దురుడు హిమమ్ము వహ్నిగను - దోచుట నీకును
యుక్తమే సఖీ! 52

గరకరి = క్రూరత్వముతో.

తా॥ ఓ రాధా ! స్వయంకృతాపరాధము వలన గలిగిన కష్టమునకు జింతింప నేల ? నీ విపరీత కార్యములే నిన్నింతవరకు దెచ్చినవి. ఓసీ ! నీ ప్రియుడు దగ్గఱకురాగా విముఖురాలవైతివి. అతడు నమస్కరింపగా మారుపలుకక మొద్దువాఱియుంటివి. సరసుడు కాగా, కఠినురాలువై క్రౌర్యమును జూపుచుంటివి. ఈ విపరీతకార్యముల వలననే నీకు చందనలేపము కాలకూట విషము వలెను, చంద్రుడు సూర్యుని వలెను, మంచు నిప్పువలెను. తాపము గలిగించుట మిగుల యుక్తములే గదా !

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహా కావ్యమునందు నవమసర్గము.

# దశమ సర్గము

అవ॥ ఇపుడు సాయంకాలమునందు చెలికత్తియ చెప్పిన సాంత్వన వచనమ్ముల గొంత కోపమును శమింపజేసికొని, మన్మథబాణ పీడితయై దుఃఖించుచున్న రాధకడ కేతెంచి, శ్రీ కృష్ణుడు స్వయముగా బ్రతిమాలుచున్నాడు.

గీ॥ అంతటు, దినాంతవేళ శ్రీ - కాంతుడేగి,
రోష నిస్స్వాస నిస్పృహ - రూక్షముఖిని,
హ్రీ సమీక్షిత సఖిని, రా - ధా సతిని, గ
నుగొని గద్గదకంఠుడై - నుడివె నిట్లు, 53

తా॥ అంతలోపల శ్రీకృష్ణుడు సాయంకాలమునందు మిగుల రోషవశమున నపారములగు నిట్టూర్పులను బుచ్చుచు, దుఃఖించుచు సిగ్గుచేత చెలికత్తియ మోమును జూచుచున్న రాధతో నానందవశమున మాటలు తడబడుచుండగా నిట్లు వక్కాణించెను.

అవ॥ శ్రీకృష్ణుని వాక్యములను గీతరూపమున నిర్దేశించుచున్నాడు.

# 19వ అష్టపది

పల్లవి॥ ప్రియతమా ! సుశీలా ! ప్రణయినీ సుచేలా ! నాపయిన
అలుక నీకేలా ?

మన్మథ ధనంజయుడు మానసము గాల్చె నే
మధురాధరామృతంబీవే॥

1] పలికినను నేదయిన పలువెలుగు వెన్నెలల్ భయమనెడి
చీకటిని బాపున్
నా కనుచకోరముల నవ్యామృతంబొసగి మోమునెల
యలరింప జేయున్ ॥ప్రియ॥

2] నిక్కముగ కోపమును గలదేని గుప్పింపు
గోటిగొరకముల నాపై
పలుగాటులను జేసి బాహుపుల బంధించు నచ్చినది
చేయవే నీకున్ ॥ప్రియ॥

3] నీవె నా భూషణము నీవె నాజీవనము నీవె నా
భవజలధి రత్నం
కాదనక నీవికను తోడుగను నుండవే; దానికొఱకేను నా
యత్నం ॥ప్రియ॥

4] ఓ చెలియ యలుకతో చెలువైన నీలంపు నీకనులు
చెంగలువలాయెన్
ఆ కనులు కనువిలుతు బాణముల భావమున – ఈకృష్ణు
రంజితుని జేయున్ ॥ప్రియ॥

5] కఠిన కుచకుంభముల పైన మణిమంజరుల్ నీహృదయ
పీఠమున వెల్గున్
కటిపైన రతనాల మొలనూలు మ్రోగుచున్ వలఱేని
యానతిని దెల్పున్ ॥ప్రియ॥

6] తామరల నిరసించు మానసము మురిపించు కలయికలో
వెలుగు మీగాళ్ళన్
సరసమగు లత్తుకలసారమును వ్రాసెదన్ ప్రియమార
బలుకవే కల్కి ॥ప్రియ॥

7] మరువిషము విఱుచునవి నాశిరము మెఱచునవి నీ యడుగు
తలిరులను నిడుమా
రతిరాజు సెగచిచ్చు రగులనీయక పెచ్చు అయ్యవి
వికారముల బాపున్ ॥ప్రియ॥

8] రాధికను గనుగొనుచు మాధవుడు వినయమున చతురుడై
బ్రతిమాలు గీతం
సుకవి యతిజయదేవ సుకృతమై సుజనులకు సుఖములను
శుభములను గూర్చున్ ॥ప్రియ॥

మన్మథ ధనంజయుడు = మన్మథాగ్ని; కనువిలుతు = మన్మథుడు.
సుకృతమై = 1) బాగుగా వర్ణించబడినది 2) పూర్వపుణ్యఫలమై.

తా॥ ప॥ చారుశీలవగు ప్రియతమా! పట్టు పుట్టములతో శోభిల్లు ప్రియురాలా! నాపై యకారణమగు కోపమును మానుము. ఇపుడు మన్మథాగ్ని చే నా మనస్సు దహింపబడుచున్నది. నీ యధరామృత పానము దయచేయుము.

1) ఇంచుకంత నాతో మాటాడితివేని, నీ దంతకాంతి యనెడి వెన్నెల నా భయమనెడి చీకటిని బోగొట్టును. నీ ముఖచంద్రుడు నా నేత్ర చకోరముల కమృతమునొసంగి సంతోషింపజేయును గాక.

2) ఓ సుదతీ! నీవు నాపై నిజముగా కోపమును బూనితివేని, తీక్ష్ణములగు నీ గోళ్ళనెడి యీటెలచే నన్ను బొడువుము. కాదేని నాచేతులను త్రిప్పి కట్టి వేయుము, లేదేని నీబాహువులతో బంధించుము. అదియును కాదేని నీదంతములతో కొఱకుము. వేయేల? ఎయ్యది నా యపరాధమునకు

దగిన దండనమో దాని నాలోచించి నీ మనమునకు సమాధాన మగునట్లు శిక్షను విధింపుము. కోపమును మాత్రము విడువుము.

3) ఓ రాధా ! నీవే నాకు భూషణము. నీవే నాకు జీవనము. నీవు నా సంసారమనెడి సముద్రమునందలి రత్నము. ఇదిగో నీకు నమస్కరించుచున్నాను. నాపై దయయుంచి నన్ననుసరించి యుండుము. దీనికై నాహృదయమెంతయో ప్రయత్నము చేయుచున్నది.

4) ఓ తన్వీ ! నీ కన్నులు నల్లగలువ కాంతిగలవయ్యును, కోపముచేత ఎఱ్ఱగలువల యందము నొందినవి. కాని యీ నేత్రములు మన్మథబాధ భావము నొంది కృష్ణుడ (నల్లనివాడ) నగు నన్ను రంజింప (ఎఱ్ఱగ) జేయునవి యయ్యేనేని, యివి యీ ఎఱ్ఱగలువల చందము నొందుట ఎంతయో నందముగ నుండును.

5) ఓ ప్రియురాలా ! కలశములపై హారములు ప్రకాశించునట్లు నీ కుచ కుంభములపై రత్నహారములు వెలిఁగి, నీ వక్షస్థలమును రక్షించును గాక. నీ జఘనభాగమునందు ఒడ్డాణమునందలి మణులు గలగలమని మ్రోగును గాక. అట్లు మ్రోగుచు విలాసినులందఱు యథేష్టముగ గ్రీడింపుడనెడి మన్మథుని యాజ్ఞను బ్రకటించును గాక.

6) ఓ మృదు భాషిణీ ! మెట్టదామరలను దిరస్కరించు సౌందర్యము గలిగి నా హృదయమును రంజింపజేయునవియై. రతిరంగమునందు పరస్పర శోభచే ప్రకాశించు రెండుపాదముల నెఱ్ఱనగునట్లు లత్తుకను బూసెదను. ఒకసారి ప్రియమార మాటాడుము.

7) ఓ ప్రియురాలా ! మన్మథవిషమును విఱుచునవియై మిగుల సుందరము లగు నీ చరణపల్లములను నాశిరమున కలంకారములగునట్లు చేయుము. మన్మథ తాపాగ్నివలన గలిగిన వికారములను నీ చరణపల్లవములు శమింపజేయును గాక. (తలకెక్కిన విషము విరుగుటకు తలకు ఆకులు కట్టుట కలదు,)

8) చాతుర్యములై మధురములై రాధయెదుట శ్రీకృష్ణునిచే వక్కాణింప బడిన ప్రియవాక్యములు. వారి పూర్వపుణ్యఫలము వలన బాగుగా

వర్ణింపబడినవై సుజనులందఱికి సుఖములను శుభములను గలుగ జేయును గాక.

అవ॥ ఇపుడు శ్రీకృష్ణుడు తన్ను దోషరహితునిగా దెలియజేయుచు సంభోగార్థమై ప్రోత్సాహముఁ జేయుచున్నాడు.

శా॥ శంకాక్రాంత మనోరవింద! విడుమా - శంకన్; పరస్త్రీలకే
వంకన్ స్థానములేక నాహృదయమున్ - వర్తింపు చక్రస్తనీ!
లెంకన్నీకును నౌదుసింక సఖియా - హ్రీ క్రోధముల్మాని, ని
శ్శంకన్ నీస్తనకుంభదానమునకై - సంరంభముం
జేయవే! 54

హ్రీ = సిగ్గు; శంక = 1) సందేహము 2) భయము 3) విచారము.

తా॥ ఓసీ! అనుమానగ్రస్తురాలా! గొప్పవైన చక్రస్తనములు ఘనజఘనమును గలిగి నీవు నా హృదయమునంతయు నాక్రమించుకొని యించుకంతయు చోటులేకుండా జేసితివి. అనంగుడైన ఒక్క మన్మథునికే తక్క యితరులెవ్వరు నామనస్సున ప్రవేశింపగలరు? కాన నీవట్టి సందేహమును వీడి నన్ను నీ కింకరునిగా స్వీకరించి, నీ సిగ్గును కోపమును మాని నిస్సందేహముగా నిర్భయముగా నిర్విచారముగా నీ కౌగిలిని ప్రసాదింపుము.

అవ॥ ఇక శ్రీకృష్ణుడెట్టకేలకు తానపరాధముఁ జేసినవాడనేయని యొప్పుకొని రాధను బ్రతిమాలుకొనుచున్నాడు.

గీ॥ ముగుద! ముదమొంద బొనరింపు - ముకుళ దంత
దంశదోర్వల్లి బంధన - స్తనని పీడ
నముల; చండి! పంచశర చం - డాల కాండ
ఖండనమున నిర్దళిత జీ - వుండనైతి. 55

ముకుళ = అరవిరిమొగ్గ; దంశ = కాటు;
నిర్దళిత = భేదింపబడినది.

తా॥ ఓ ముగ్ధురాలా! నే నపరాధినని తలచినచో, దంత క్షతములనో, బాహువులను తీగెలచే కట్టివేయుటయో, కఠిన స్తనములచే పొడిచి వేయుటయో, నీకిష్టమగు కఠినదండనమును వేయరాదా? ఓ చండీ! ఆ మదన చండాలుడు నిర్దయుడై తన బాణములను ప్రయోగించి నా ప్రాణములను చెండుచున్నాడు నా ప్రాణము లెగిరి పోవుచున్నవి. ఇక నీవు హాయిగా జీవింపవచ్చును.

అవ॥ వాత్స్యాయన న్యాయము ననుసరించి క్రమముగ రాధ యనుకూలు రాలగునట్లు చేయుచున్నాడు.

చం॥ మది వ్యథజెందె వ్యర్థమగు – మౌనమునన్, పికపంచమస్వరం
బుదయముగాగ తన్వి! మధు–రోక్తుల విస్తృతిజేసి, తాపముల్
వదలగజేసి దృక్కుల, ప–రాఙ్ముఖభావము వీడవే సఖీ!
సదమలసఖ్యబంధమున – సన్నిధిజేరితి స్వీకరింపవే! **56**

తా॥ ఓ తన్వీ! నీవు వ్యర్థముగ మాటాడకుండుటవలన, నాకెంతయు కష్టము గల్గుచున్నది. కావున నో తరుణీ! కోకిలవలె పంచమ స్వరమున తీయనిపలుకుల బలుకుము, నీ చల్లని చూపుల నా తాప మును బాపుము. ఓ ప్రేయసీ! మాఱుమొగము పెట్టకుము. నన్నిత రునిగా భావించి త్రోసివేయకుము. ఓ వెఱ్ఱిదానా! నీపై నత్యంత ప్రేమచే నేనే స్వయముగా వచ్చినాను. నన్ను పరిగ్రహింపుము.

వి॥ తన్వీ = కృశించిన శరీరము గలదానా యని యనుటచే, నీవు కృశించి నందున మాటాడ శక్తిలేక మౌనమునొందినదానవు గావు. ఇక నేమన? నన్ను సాపరాధునిగా దలంచి కోపముచే మాటాడకున్నావు అని ఎత్తిపొడుపు మాట.

ఆ॥ వె॥ ముక్కు నువ్వు పువ్వు ; -మోవి మంకెనపువ్వు;
కన్నుదోయి నల్ల – గలువపూలు;
చెక్కిలిప్పపూవు; – చెలి నీదు ముఖసేవ
పూవిలుతుడు లోక – ములను గెలుచు. 57

తా॥ ఓ ప్రియురాలా ! నీ చక్కనిముక్కు నువ్వుపువ్వును బోలియున్నది. నీ కన్నులు నల్లగలువలను తిరస్కరించుచున్నవి. నీ నున్నని చెక్కిళ్ళు ఇప్పపూవులవలె పచ్చనై ప్రకాశించుచున్నవి. ఈ సన్నివేశమును జూడగా పుష్పాయుధుడు తన యాయుధములను నీ యవయవములం దమర్చుకొని తాననంగుడయ్యును లీలగా ప్రపంచము నంతయు జయించుచున్నాడని తలంచెదను.

చం॥ కనులు మదాలసన్, వదన-కాంతులు నిందుమతిన్, చరించు లీ
ల నల మనోరమన్, తొడలు – రంభను, మైథునమౌ కళావతిన్,
కనుబొమ చంద్రలేఖను, మ-నంబున దోపగజేయు నో ర! నీ
తనువున దాల్చి గెల్చితివి – ధారుణినుండియు
స్వర్గభామలన్. 58

తా॥ ఓ రాధా! నీ కనులు మదాలసలు; [మదముచే నలసములైనవి - స్వర్గమునందలి మదాలస యను నప్సరసను] నీ ముఖపుకాంతులు ఇందుమతిన్ [చంద్రుని బోలునది - ఇందుమతి యను నప్సరసను] నీ నడలు మనోరమ [మనోహరమైనవి - మనోరమ యను నప్సరసను] నీ తొడలు రంభను [అరటి కంబములను - రంభ యను నప్సరసను] నీ రతి కళావతిన్ [హావము మున్నగు కళలు గలది - కళావతి యను నప్సరసను] నీ కనుబొమ చిత్రలేఖను [చిత్రములగు లేఖ (రేఖ) లు గలది - చిత్రలేఖ యను నప్సరసను] వాటిని బోలుచున్నవి. ఔరా యేమి యీ విచిత్రము! నీవు భూమిపై నున్నదానవయ్యును, స్వర్గము నందలి యందగత్తెలగు నప్సరసలను [మదాలస - ఇందుమతి -

మనోరమ - రంభ - కళావతి - చిత్రలేఖ] నీ యొడలియందే ధరించి వారి యందచందములను మించినదానివైతివి.

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహా కావ్యమునందు దశమ సర్గము.

# ఏ కా ద శ స ర్గ ము

అవ॥ పదియవ సర్గమునందు జెప్పబడినరీతి శ్రీకృష్ణుడు రాధ ననునయించి యొక పొదరింటికి జేరగా, చెలికత్తియ, ఆ శ్రీకృష్ణుని సమీపమునకు బొమ్మని ప్రోత్సహించుచున్నది.

గీ॥ ఒఱపు బలుకుల జవరాలి - నూఱడించి,
శౌరి కైసేసి పూపాన్పు - జేర, ముదిత
రాధ, కోర్కితో మునిమాపు - రవణములను
వలువలను దాల్ప, - నొక చెలి - పలికె నిట్లు. 59

ఒఱపు బలుకులు = అనునయ వాక్కులు; రవణములు = నగలు.

తా॥ శ్రీకృష్ణు డనేకవిధముల రాధ ననునయించి, సంతోషపఱచి, తా నలంకరించుకొని, ఒక పొదరింటిలోని పూపాన్పుపైకి చేరబోగా, రాధయు సంతసించి, సాయంకాలమునందు జీకటి పడిన పిదప రతికి యోగ్యములైన నగలను వలువలను దాల్చియుండగా, నొక చెలి యీలాగున బలుకసాగెను.

ముదిత = సంతోషించినది.

## 20వ అష్టపది

పల్లవి. మధుమథనుని చెంగటకును జేరవె రాధా రమణీ !

1) చరణములనుబడి చాతురి మెఱయగ శరణము వేడిన ప్రియుడు,

పరువపు ప్రబ్బలి పూవులపొదలో పొన్నున జేరెను
ఇపుడు ॥మ॥

2) మృదులనితంబ పయోధర భరమున నూపురమణులును
ఘల్లన
మెల్లని నడలను నంచలమించుచు పువ్వుల శయ్యకు
పదవే ॥మ॥

3) యువతుల మతులకు మధురంబౌ నా మధుకరగీతము వినవే
మదనుని యానతి మది కొనియాడే కోయిల గుంపుల
గనవే ॥మ॥

4) గాలిని గదలిన తీవెల వెలదులు చివురుల చేతుల ప్రీతిన్
ప్రేరణజేసెను ప్రియుదరి జనుమని తడవిటజేయుట
తగునే ॥మ॥

5) మణిమాలల జలధారుల నలరుచు మారునితరగల గదలుచు
హరి పరిరంభము గలదను స్తనకలశమ్ముల నడుగవె
మరిమరి ॥మ॥

6) నీమెయి రతికయి త్వరపడ భామిని! నీ సఖులకు
దెలియును లే!
మొలనూలు గిడియ మ్రోయగ, బిడియము వీడగ,
వెడలవె లీలన్ ॥మ॥

7) కర నఖములు మరుబాణము లనగా, కంకణ రవములు
గమనము
దెలుపగ, చెలులతో లీలగ హరిదరి కరుగవె యరుసము
మీఱగ ॥మ॥

8) భక్తితో యతి జయదేవులు వ్రాసిన ముత్తెపు సరములు
మీఱిన
కమనీయంబగు గీతము భక్తుల కంఠము నలరును
సతతము ॥మ॥

గిడియ = రాయడి గిడిగిడి యను భేరి – డిండిమము.
అరుసము = హర్షము.

1) తా॥ ఓ రాధా ! తెలివిమాలినదానా (అభిసారసమయము నెఱుంగనిదానా) కృష్ణుడు నీకు శరణాగతుడై యెన్నెన్నియో ప్రియవాక్యములు బలుకుచు నీ యడుగులకు నమస్కరించిపోయి యిప్పుడు మనోహరమగు ప్రబ్బ పొదరింటిలో క్రీడాశయ్యపై బరుండియున్నాడు. కాబట్టి యట్టి కృష్ణుని సమీపమునకు త్వరగా బొమ్ము.

2) నీవు స్తనభారముచేత వేగముగా నడువలేనప్పటికిని మెల్లమెల్లగా నడుగుల నిడుచు రతనాల యందెలు గల్లుగల్లున మ్రోగుచుండగా నా ధ్వనిచే రాజహంసలను తిరస్కరించుచు శ్రీకృష్ణుని శయ్యకు జేరుము.

3) రాధా ! వినుటకు నెంతయు మనోహరమునై ప్రాయపు పడచులను మోహింపజేయు తుమ్మెదల ధ్వనిని చెవులార వినుము. మరియు మన్మథుని యాజ్ఞను గొనియాడు వందిమాగధులవలె గూయుచున్న కోయిల గుంపులను జూడుము.

4) ఓ రాధా ! అటు చూడుము. ఆ తీగలు గాలికి గదలుచున్నవై చిగుళ్ళనెడి చేతులతో నీ ప్రియునిచెంత కేగుమని నిన్ను ప్రేరేపింప జేయుచున్నవో యనునట్లు ప్రకాశించుచున్నవి. కావున ఆలస్యము చేయక శ్రీకృష్ణునిచెంత కేగుము.

వి॥ చల్లని గాలి, చిగిర్చిన తీగెలు కనబడుట, ప్రయాణమునకు శుభసూచకములని అభిసారమునకు నింతకన్న మంచిసమయము చేకూరదనుట

"వామే మధురవాక్పక్షీ వృక్షః పల్లవితోఽగ్రతః
అనుకూలో వహన్వాయుః ప్రయాణే శుభసూచకః" (శకున శాస్త్రము)

5) ఓ రాధా ! ముత్యాలసరము అనెడి జలధారలు బయలుదేర, మన్మథ తరంగములచే నటు నిటు గదలుచున్న నీ కుచ కుంభములను "ఈ చెలికత్తియ చెప్పు మాట మంచిదా కాదా" యని యడుగుము.

వి॥ రాధ రసతరంగిణి — అలల తాకిడిచే నిండుకుండ యెట్లు కదలునో యట్లే ఆమెయందును ఆమె కుచములనెడి కుంభములు కదలుచుండుట సహజమే.

"నిత్యం నార్యాః స్తనే కంపః ప్రియసంగమ సూచకః" (శకునశాస్త్రం)

అవ॥ "చెలీ ! నీవు చెప్పుమాట మంచిదేకాని యింతమంది చెలికత్తియలు చూచుచుండగనే సిగ్గుమాలి కృష్ణుని కడకు నేనెట్లు బోదును" అనిన చెప్పుచున్నది.

6) ఓ రాధా ! నీ శరీరము కృష్ణునితో రతియుద్ధమునకు సన్నద్ధమై యున్నదను సంగతి నీ చెలులందఱు నెఱుంగుదురు. కావున నీవు సంశయింప నేల ? దీర్ఘకోపమును బూననేల ? బంగరుగజ్జెలు గల నీ యొడ్డాణ మనెడి డిండిమము గణగణ మ్రోయుచు జయజయధ్వనులు బలుకగా ననురాగముతో గూడి సిగ్గునువీడి శ్రీకృష్ణుని సన్నిధికి వేగిరముగా బొమ్ము.

7) రాధా ! మన్మథుని బాణములవలె నీ చేతిగోరులు మెఱయుచుండగ [చెలికత్తియలను విలాసముగ బట్టుకొని] నీ చేతిగాజుల కాళ్ళయంది యల ఘళఘళంధ్వనులు నీ గమన స్వరూపమును దెలుపుచుండగ శ్రీకృష్ణుని కడకు బొమ్ము.

8) భక్తిప్రపత్తులతో వ్రాసినదియు ముత్యములవలె గుండ్రనిఅక్షరములతో నలరారునదియునగు యతిశ్రీ జయదేవుల గీతము. శ్రీకృష్ణభక్తుల కంఠములందెల్లవేళల ప్రకాశించునుగాక.

అవ॥ ఇపుడు చెలికత్తియ రాధ కభిసార సమయమును దెలుపుచున్నది.

చం॥ కనులను నీలికాటుకయి, - కానుగుపూలయి కర్ణపాళులన్,
జనులను కమ్మకస్తురయి, - నల్లనికల్వలునొచు కొప్పునన్,
దనువున మేల్ముసుంగునయి, - తాపముతో చెలికాంద్రజేరు కా
మినులఁ గవుంగలించును త - మిస్ర మహో యొడలెల్ల
దాఁకుచున్. 60.

తా॥ చెలియా రాధా! ఈ కటికచీకటి యెంత విచిత్రముగా నున్నదో చూడవే! కన్నులయందు నల్లని కాటుక శకలై, చెవులయందు నల్లని చీకటి కానుగు పూవులై, స్తనములందు నల్లని కమ్మ కస్తురితో వ్రాసిన మకరికాదిపత్రరేఖలై, కొప్పులో నల్లగల్వలై, తనువున నల్లని మేలి ముసుంగునై ప్రకాశించుచు, రాత్రివేళ ధూర్తలై చెలికాండ్రకొఱకు సంకేతస్థానములకేగు జవరాండ్రయొక్క ప్రత్యవయవమును తాకుచు నీ చీకటి పొదరిండ్లలో వ్యాపించియున్నది గదా!

అవ॥ "ఓ రాధా! యీ కటిక చీకటియందు నీకొఱకు శ్రీకృష్ణు డెదురుచూచు చున్నాడు. గాన వేగమే బయలుదేరుము" అని చెలికత్తియ చెప్పు చున్నది.

గీ॥ గౌరవర్ణంబు గలిగిన – కామినుల శ
రీరకాంతి రేఖలుగ దీ – ర్చిన తమాల
పత్ర నీలితమ తమంబు, – పంకజాక్షు
రాగ రుక్మంబునకు గీటు – రాయి యగును. 61

తా॥ ఓ రాధా! పసుపు కుంకుమల కలయికవలె, గౌరవర్ణ కాంతిగల యభిసారికానాయికల శరీరకాంతి పుంజములచే రేఖలు దీర్చబడి, చీకటి కానుగుచెట్ల యాకులవలె నల్లనైయున్న యీ గాఢాంధకారము శ్రీకృష్ణుని ప్రేమయనెడి బంగారమునకు నొరపిడిరాయి [గీటు రాయి] కాగలదు.

వి॥ అభిసారికలు ధరించిన రత్నాభరణముల కాంతు లుభయపార్శ్వము లందు ప్రసరించి రేఖాకారముగా తేజరిల్లుచుండ, గౌరవర్ణము గలిగిన యా స్త్రీలకాంతి యంధకారమనెడి గీటురాయియందు ఒఱచిన ప్రియుని ప్రేమయనెడి బంగారురేఖలవలె ప్రకాశించునని భావము. అనగా నిట్టి గాఢాంధకారమునందు సర్వమునువదలి ప్రాణములనుగూడ లెక్క చేయక యేకాంతముగా వచ్చినందున తనపై నత్యంతానురాగము గల్గియున్న దీరాధయని శ్రీకృష్ణుడు తప్పక తలంచునని భావము.

అవ॥ ఇపుడు భావాంతరమునొంది శృంగారరసమును బోషించుచు బలుక
చున్నది.

గీ॥ హార కంకణ మంజీర – హీర మణి క
దంబ మండిత గహ్వర – ద్వారమునను,
లజ్జతో హరి గనుగొను – రాధతోడ
చెలిమికత్తియ ప్రీతితో – పలికె మరల॥ 6

గహ్వరము = పొదరిల్లు.

తా॥ తరువాత రాధ సంకేతస్థానమునకు జేరి, యా పొదరింటివాకిట త
హారములు కంకణములు నందెలు మొ॥ అభరణములందలి మ
కాంతులు బయలుదేరి చీకటిని బోగొట్టి వెలుతురును గలుగజేయగా
పొదరింటిలో కృష్ణుని గనుగొని, యెంతయు సిగ్గుజెంది, ద్వారమ
నందు నిలబడియుండగా, చెలికత్తియ చూచి, మరల నిట్లు చెప్ప
నారంభించెను.

అవ॥ ఆ సఖీ వాక్యములనే గీత రూపమున వివరించుచున్నాడు.

# 21వ అష్టపది

పల్లవి॥ మాధవుని సన్నిధికి జనవె రాధా ,,, ॥

1) హరువైన పొదరిండ్ల రతుల నెలమిన్ ,,,
దరహాస మొలుకగా క్రీడింపవే ,,, ॥మా॥

2) స్తనకలశముల పైన సరము లూగన్ ,,,
జని యశోకపు సెజ్జ క్రీడింపవే ,,, ॥మా॥

3) విరులవలె మృదువైన నెమ్మేనితో ,,,
విరులలరు నెలవునను క్రీడింపవే ,,, ॥మా॥

4) అల తెమ్మెరల వలన నలులు మ్రోగా ,,,
నలరగా ననపొదల క్రీడింపవే ,,, ॥మా॥

5) కోయిలల గొలగొలలు గల తావునన్ ,,,
సోయగపు నగవులతో క్రీడింపవే ॥మా॥

6) పీనకుచ కలశఘన జఘనముల తో ,,,
లే నవల యీరముల క్రీడింపవే ,,, ॥మా॥

7) జృమ్మనుచు తుమ్మెదలు మెదలుచోటన్ ,,,
కమ్మవిలుతుని తముల క్రీడింపవే ,,, ॥మా॥

8) పద్మావతీ సరోజాపతులు శ్రీ ,,,
జయదేవ యతివరుల గీతములతో ,,, ॥మా॥

1) తా॥ ఓ రాధా! మాధవుని సన్నిధికి బొమ్ము. మనోజ్ఞమైన పొదరిండ్లలో రతిరభసమున చిఱునవ్వులతో శ్రీకృష్ణునితో నానందముగా ననేక రతులను ననుభవింపుము.

2) ఆ అందాల పొదరింటిలో అశోక పూలరేకుల పాన్పుపై బంగరు గిండ్ల వంటి చనులపై ముత్యాలహారము లూగుచుండగా శ్రీకృష్ణునితో నానందముగా క్రీడించుము.

3) పుష్పమువలె నతి సుకుమారమగు శరీరముగల రాధా! అనేక పువ్వులచే రచింపబడి మిక్కిలి పరిశుద్ధమగు పడకటిల్లుగల యా పొదరింటిలో శ్రీకృష్ణునితో యధేచ్ఛగా క్రీడింపుము.

4) మన్మథుని సేనలను తుమ్మెదలు మధురముగా ఝుంకార ధ్వనులు సేయుచుండగ మలయమారుతము చల్లగా వీచుచుండగా కృష్ణునితో తృప్తిదీఱ క్రీడింపుము.

5) కొమ్మలపై కోయిలలు కలకలారావములు వేయుచుండగా, అందా లొలుకబోయుచు చిఱునవ్వులతో శ్రీ కృష్ణునితో నిచ్చవచ్చినట్లు క్రీడింపుము.

6) బలిసి బరువైన చనుదోయి యుప్పొంగుచుండగా గొప్పవైన పిఱుదలు గదలాడుచుండగా నలరింపజేసి లేతచివుల్లు గలిగిన పొదరింటిలో ముదమార కృష్ణునితో క్రీడింపుము.

7) ఝుమ్మన గ్రమ్మి జ్ఞుం జ్ఞుమ్మను ధ్వనులు తుమ్మెదలు వేయుచున్నవి. అనగా మాధవుని మోవితేనెలను జుఙ్ఘుము జుఙ్ఘుము అని మన్మథుని సేనలగు తుమ్మెదలు ఆజ్ఞాపించుచున్నవి. జుఙ్ఘుము అను పదమునకు సంక్షిప్తపదము "జ్ఞుం–" తుమ్మెదలే త్వరపెట్టుచుండగా నిక జాగుచేయరాదు. కాన మన్మథ సంబంధమగు కోర్కెలు కడ ముట్టునట్లుగా శ్రీకృష్ణునితో మనసుదీర క్రీడింపుము.

8) సౌ॥ పద్మావతీ సరోజాపతులైన, శ్రీ జయదేవ యతిశ్రీలు రచించిన మధుర గీతములు, చెలికత్తియలమగు మేము గానము చేయుచుండగా, త్వరత్వరగా బయలుదేరి కృష్ణుని కడకు బొమ్ము.

వి॥ ఈ యష్టపది 21వది. 7వ చరణము వ్రాయ నారంభించితిని. అంతలో నొక నల్లని గండుతుమ్మెద నే వసించిన మిద్దె వసారాలోనికి ప్రవేశించి దంతెలపై వ్రాలునపుడెల్ల జ్ఞుం అనుచు ధ్వనిజేయుచు బయటికి వెళ్ళుచు పుతల లోపలి కేతెంచి మరొక దంతెపై జ్ఞుమ్మని ధ్వనితో వ్రాలుచు నిలా 21 పర్యాయములు చేసినది. నాకాశ్చర్యమువేసి గమనించుచుంటిని. ఇలా 21 పర్యాయములు ఎందుకు జ్ఞుం అని ధ్వని జేసినదా యని యాలోచింప సాగితిని. అంతలో నొక యాలోచన నా మనస్సున మెదలెను. 21వ అష్టపది వ్రాయునపుడు 21 పర్యాయములు వచ్చిన వల్లతుమ్మెద పరిశీలించి జూడ, 21 పర్యాయములు మదాంధులైన రాజులను వధించిన పరశురామావతారమెత్తిన శ్రీ మహా విష్ణువే యనిపించినది. ఏకవింశత్యవతారములు దాల్చిన ఆ నల్లనయ్య శ్రీకృష్ణ పరమాత్మ తుమ్మెద రూపంలో వచ్చి "జ్ఞుం" శబ్దమునకు

అర్థము నాలోచింపమనినాడా యని యనిపించినది. తీవ్రముగా నాలోచించితిని. చివరకు నిట్లు స్ఫురించినది. "జుఝుము" శబ్దమునకు సంక్షిప్తరూపము "జృం" యని – ఈవిషయము నేననృతమాడవలసిన పనిలేదు. నేననృతమాడిన నేలోకములు ప్రాప్తించునో యిది యసత్యమని యవహేళన జేసినవారికి నాలోకములే ప్రాప్తించును గాక. అ నల్లని తుమ్మెద రూపములో ఆ నల్లని కన్నయ్య సాక్షాత్కరించాడని నా పరిపూర్ణ విశ్వాసము. – "య తి శ్రీ."

**అవ॥** చెలికత్తియ రాధయొక్క లజ్జాభయములు దొలగించుచు శ్రీకృష్ణుని యత్యుత్కంఠను జెప్పుచున్నది.

శా॥ కాంతా ! స్వాంతమునన్ భరించి నిను, నా – క్ష్మాకాంతు
డశ్రాంతమున్
శ్రాంతుండై మదనానలంబున, సదా – సంతప్తుడై, తావకౌ
ష్ఠాంతోత్కృష్ట సుమాధురీ సుధల తా – నర్థించు త్వద్దాసుడై,
చింతం జెందక తిష్ఠవేయ జనవే – శ్రీకృష్ణు
నంకస్థలిన్॥ 63

**తా॥** ఓ రాధా ! శ్రీకృష్ణుడు బహుకాలమునుండియు నిన్ను దన మనస్సుచేతనే వహించుచున్నందున నెంతయు బడలినవాడై మన్మథునిచే మిగుల సంతాపము నొందుచు తన తాపవ్యాధికి నౌషధముగా నీయధరామృతమును బానముసేయ గోరుచున్నాడు. కాన క్షణకాల మాకృష్ణుని యంకతలమున నలంకరింపుము. అతడు నీ కనుసైగ యెట్లు ప్రవరించునో యట్లు నీ పాదసేవ జేయుచు దాసుడై యున్నాడు గదా ! అతనివలన నీకు భయమేల ?

**అవ॥** రాధాకృష్ణుల సంభోగ శృంగారమును ముందు వర్ణింపబోవుచు దానికి హేతుభూతమగు రాధా ప్రవేశమును జెప్పుచున్నాడు.

కం॥ భయ హర్షంబులు బెనగొన,
శయనము చేరువ హరిగని - చపలాక్షుల, నం
దియలును ఘల్లని మ్రోయగ,
నయగారములొలుక, రాధ - ననపొద జేరెన్॥ 64

నన = 1) వివురు; 2) పూవు.

తా॥ అంత నా రాధ క్రేగంటిచూపుల శ్రీకృష్ణుని జూచుచు, మనమున భయము నానందము బెనగొనగ, కాలియందెలు ఘలు ఘల్లున మ్రోయు చుండ, హొయారము లొలుకుచు, కేళిమందిరమగు వివురుల పూవులతో గూడిన పొదరింటిలో ప్రవేశించెను.

అవ॥ రాధ పూ పొదరిల్లు ప్రవేశించి, కోటిప్రభాకర ప్రభాభాసమానుండును దశకోటి నిశాకర కళావిలాసుండును, శతకోటిమన్మథ లావణ్య రూప రేఖా విరాజమానుండును నగు శ్రీకృష్ణుని సోయగమున కబ్బురము జెంది కన్నులార్పక జూచుచుండెను.

# 22వ అష్టపది

ప॥ తలపుల వలపుల పులకలు ముసరగ, తననే తలచెడువానిన్
అలరుల విలుతుని యలరును మించిన ఆహరి రాధిక గాంచెన్.

1) చంద్రుడుగనుంగొని చెంగునఁ బొంగెడు సంద్రము బోలిన వానిన్
రంగగు తన మోముంగని ముదన తరంగము లురలెడు సామిన్ ॥తలపుల॥

2) మురువగు ముత్యపు సరములు మెఱయుచు నురమున వ్రేలెడువానిన్
తెల్లని నురుగుల నల్లని యమునను వెల్లువ యనదగు. సామిన్ ॥తలపుల॥

3) నీలపు మేనున పచ్చని పటములు నీలమణులు గలవానిన్
పచ్చని పుప్పొడి పై గల నల్లని కలువగ వెలిగెడి
సామిన్ ॥తలపుల॥

4) కళగల మొగమున కదలెడికన్నుల రతులను రాగిలువానిన్
కాటుకపిట్టలు గల కమలముల తటాకము దీటగు
సామిన్ ॥తలపుల॥

5) మోము వెలుగునకు వేవెలుగులదొర సరియగు పోగులవానిన్
మోవుల చిపురుల మొగ్గల నగవుల మోహము లొలికెడు
సామిన్ ॥తలపుల॥

6) వెన్నెల వెలిగెడు మొయిలు కురులలో విరులతొనలరెడు
వానిన్
చీకటిలో నెల చెలువున మోమున సిరిగంధము గల
సామిన్ ॥తలపుల॥

7) పులకల మొలకలు సెలగగ దనువున కలయిక
వలగొను వానిన్
వెలగల నగలును విలువగు మణులును విలసిలు
మెయిగల సామిన్ ॥తలపుల॥

8) యతి జయదేవుల నుతులను రవణము లినుమడి
దనరెడివానిన్
మతినిడి శ్రీపతి నతులొనరింపుడి సుగతికి గతియగు
సామిన్ ॥తలపుల॥

తా॥ ప॥ రాధా! రాధా యని తననే తలచుచుండగ, వలపు జనింపగ, వలపులో నొడలు పులకరింపగ అలా రాధా నామస్మరణము జేయుచున్న వానిని, మన్మథుని సోయగమును మించిన సోయగముగల శ్రీకృష్ణుని, పూల పొదరింటిలో పూలపాన్పున రాధ గాంచెను.

1) చంద్రవదనయైన రాధా ముఖదర్శనముచే మన్మథ వికార తరంగము లుప్పొంగుచు పున్నమనాటి చంద్రునిగాంచి నుప్పొంగు తరంగములు గల సముద్రుడో యన నొప్పెడు శ్రీకృష్ణుని రాధ జూచెను.

2) స్వచ్ఛమగు ముత్యాలహారములను నిడుపుగ వక్షఃస్థలమునందు ధరించిన వాడు గావుననే స్ఫుటముగ గనబడుచున్న నురుగులుగల యమునాజల ప్రవాహమువలె బ్రకాశించు శ్రీకృష్ణుని జూచెను.

వి॥ నల్లని యమునానది శ్రీకృష్ణనకును తెల్లని ముత్యాలహారములు నురుగులు గలిగిన జలప్రవాహమునకును సామ్యము జేయబడినది.

3) నల్లని దివ్యశరీరమునందు పచ్చని పట్టువస్త్రములు ధరించినందున పచ్చని పుప్పొడిచే ప్రకాశించి నల్లగలువవలె విలసిల్లు శ్రీకృష్ణుని రాధ జూచెను.

4) చంచలములగు నల్లని కడగంటిచూపుల కదలికలవలన, నత్యంత సుందరమగు తన ముఖముచేతనే కేళుల యందెంతయో ననురాగము దెలుపుచున్నవాడు గావున, శరత్కాలమందు చక్కగ వికసించిన కమలముల నడుమ కాటుకపిట్టల జంటలు విహరించుచుండ, బ్రకాశించు తటాకమువలె నుండు శ్రీకృష్ణుని రాధ జూచెను.

5) ముఖకమలమును వెలిగించుటకు నేతెంచిన సూర్యులోయన, కాంతి మంతములగు కుండలములను ధరించినవాడును, మిగుల నందమగు, చిగురువంటి పెదవులయందు, మొగ్గలవంటి చిఱునవ్వులు మొలకలెత్త సంభోగము నపేక్షించువాడగు శ్రీకృష్ణస్వామిని రాధ జూచెను.

6) తెల్లని వెన్నెలగల నల్లని మేఘమువలె, నడుమ పూవులచే బ్రకాశించు కేశపాశము గలవాడును, చీకటిలో చంద్రుడుదయించినరీతి మోము నందు తెల్లని గంధపుచుక్క బొట్టుగలవాడగు శ్రీకృష్ణుని రాధ జూచెను.

7) విస్తారముగా నుప్పొంగుచున్న గగుర్పాటు తనువున గలవాడును, రతి కేళీ విలాసముల కోర్కెలు తనచుట్టుముట్టగ, ధైర్యము కోల్పోయిన వాడును, ననేకములగు మణిభూషణముల కాంతులచే బ్రకాశించు దివ్య మంగళ విగ్రహముగల శ్రీకృష్ణుని రాధ జూచెను.

8) తన కళ్యాణ గుణములచే నెంతయు నలంకరింపబడిన వాడయ్యును, శ్రీయతి జయదేవ ప్రణీతములగు వర్ణనాలంకారములచే నినుమడిగ నలంకృతుడై పుణ్యోదయమునకు సారభూతుడై మోక్షప్రదాతయైన శ్రీకృష్ణు నెల్లప్పుడు హృదయమునందు నిలిపి నమస్కరింపుడు.

అవ॥ ఇపుడు కృష్ణునకే గాక రాధకు కూడ సాత్వికోదయ మయ్యెనని నిరూపించుచున్నాడు.

ఉ॥ కాంతుని దన్వి దీఱ కడ-గన్నులు గాంచియు గాంచి, కర్ణ ప
ర్యంతము సాగిపోవగ, ప్ర-యాసము నొందిన కారణంబునన్
చింతిలి, చంచలత్వము-నొంద, జనించిన నేత్రఘర్మ మ
త్యంతము హర్ష బాష్ప జల-మై ప్రవహించెను రాధ
చెక్కులన్॥ 65

తా॥ దివ్యమంగళ విగ్రహుడైన మనోహరుని సోయగములు, రాధయొక్క కడగన్నులు చూచీ చూచీ, యతిక్రమించి చెవులపర్యంతము సాగిపోయి నందున, గలిగిన ప్రయాసముచేతనో యనునట్లు, మిక్కిలి చంచల భావమునొందిన తన కనులయందు, చెమట నీటి ప్రవాహమువలె ఆనందబాష్పములు రాధ చెక్కులబడి యక్కునరాలెను.

సాగిపోవగ = 1) కనులు ప్రయాణమై పోవగ ననియు 2) కనులు రబ్బరువలె సాగినవనియు – భావము.

అవ॥ ఇప్పుడు రాధ అనందాతిశయముచే కనులు మూసికొని యుండగా, చెలికత్తియలు చేసినపని జెప్పుచున్నాడు.

మ॥ విరితావుల్ వెదజల్లు కేళిగృహమున్ – పీడిరా నెచ్చెలుల్;
హరి పూపాన్పున బవ్వళించి నగవు – ల్దాచంగ లోలోపలన్
కర కండూతి నటింప, నాథుముఖమున్ – కళ్యారవీక్షించె మై
మఱపున్ రాధిక; లజ్జలజ్జన జనెన్ – మార్గంబునన్
దవ్వులన్॥ 66

తా॥ పూలవాసనలు వెదజల్లు కేళిగృహములో పూపాన్పున శ్రీకృష్ణుడు పవ్వళించియుండగా, పరిజనులగు చెలులందఱు నొక్కొక్కరు వెడలిపోయిరి. దురదచేత చేతిని గోకికొనుటయను కపటవృత్తిని బూని శ్రీకృష్ణుడు చిరునగవును మాటుపఱుపగా, మన్మథవికారముచే సుందరమగు శ్రీహరి మోమును, తనసిగ్గును సైతము సిగ్గుపడి దూరముగా తొలగిపోయెనో యనునట్లు, తన చెలికత్తియలు నొకరివెంట నొకరు మెల్లగా తప్పుకొని పోవునది యెఱుంగక, సాభిలాషముగా రాధ జూచుచుండెను.

ఇది శ్రీకృష్ణసేవకులైన యతిశ్రీచే విరచింపబడిన ఆంధ్ర గీత గోవింద మహాకావ్యమునందు ఏకాదశ సర్గము.

# ద్వాదశ సర్గము

అవ॥ ఇపుడు చిరకాలమునుండియు "రాధాముఖకమల దర్శనభాగ్య మెపుడు గల్గునా, రాధతో మనసుదీర నెప్పుడు ముచ్చటింతునా రాధతో పూర్వమువలె నెప్పుడు యథేష్టముగా విహరింతునా" యని యుత్కంఠతతోగూడియున్న శ్రీకృష్ణుడు రాధనుజూచిఅత్యంతానందము జెంది యిట్లనుచున్నాడు.

మత్తకోకిలము

చెలులతోడన బిడియమేగగ, – చివురుమోవిన నవ్వు వె<br>న్నెల వెలుంగగ, సిగ్గుమొగ్గలు – నిగ్గుమీఱగ, మన్మథా<br>నలము రేగగ, మాటిమాటికి – ననలపాన్పును వాలు గ<br>న్నుల గనుంగొను రాధతో, హరి–నుడివె నీగతి ప్రీతితో॥ 67

తా॥ చెలులందఱు రాధను పొదరింటియందు విడిచి తొలగిపోగా, నామె యెంతయు సిగ్గుజెంది, పెదవులందు చిరునవ్వు మొలకలెత్త మన్మథ సంబంధములగు నభిప్రాయములను సూచించుచు, మాటిమాటికి గ్రొంజిగురులచేతను పూవులచేతను రచింపబడిన పాన్పును జూచుచు నిలచియుండ, ననురాగము మొలకలెత్త కృష్ణుడు ప్రియురాలగు రాధతో నీలాగున వక్కాణించెను.

అవ॥ శ్రీకృష్ణుడు రాధతో బల్కిన ప్రియవాక్యములను గీతరూపమున నిట్లు వక్కాణించుచున్నాడు.

# 23వ అష్టపది

పల్లవి॥ మధురం రాధా నిరీక్షణం - మనమలరింపవె ఒక్కక్షణం

1) పరగెడు చివురుల పాన్పున నీపద పద్మములుంచగ రావే
పరిభవమొాగద నీపదపల్లవ వైరగు పఱుపుకు జూవే ॥మ॥

2) నడపించితి నిను బహుదూరము నీయడుగుల నొత్తగ నీవే
నావలె పీడనిపీరులు అందెలు ననపాన్పున విడవేమే ॥మ॥

3) ముఖశశి జారిన యమృతము మాదిరి ముద్దుగ బల్కవదేమే
విరహామువలె స్తనవృద్ధుల నణచెడు కంచెల
విప్పగ నీవే॥ మ॥

4) ప్రియుకౌగిలికై వేగిరపడ కడు పొంగియు దుర్లభమౌ నీ
స్తనకలశమ్ముల నెడదను నిడి నాతాపముబాపగ రావే ॥మ॥

5) నీపై వలపున నిప్పై విరహాము నిలువున గాల్చెను జూవే
మృతుడగు దాసుని బ్రతికింపగ నీ యధరామృతమును
నీవే ॥మ॥

6) కటిలో మణులును ఘలుఘలు రనగను గళరవముల విననీవే
పికశుక రవముల వికలతనొందిన పీనుల శ్రమమును
బాపే ॥మ॥

7) కినుకను వ్యర్థుడనగు నను గనుగొన సిగ్గునుబూనినవో యన
కనులును మూతలు బడుచున్నవి యిక గమనాయాసము
మానవె ॥మ॥

8) శ్రీపతి తనియగ యతి జయదేవులు వ్రాసిన రసమయ గీతం
రసిక వతంసుల మతులను రతిరసమును జనియింపగ
జేయున్ ॥మ॥

కంచెల = అవిక; కటి = మొల.

తా॥ ప॥ ఓ రాధా! నీ చంచలస్వభావమగు వీక్షణములు మనోహరముగా నున్నవి. నన్ననుసరించి యొక్క క్షణకాలము అలరింపుము.

1) ఈ చివురుటాకు పాన్పుపై నీపాదపద్మములుంచుము, నీ పాదములకు శత్రువైన యీ చివురుటాకులు పరాభవమును బొందునుగాక.

2) ఓ రాధా! నిన్ను బహుదూరమునుండి రప్పించితిని. ఆ శ్రమ దీఱునట్లు నా కరపద్మములచే నీ యడుగులను మెల్లగ నొత్తనిమ్ము. ఎల్లప్పుడును నావలె నిను వీడక వీరులబోలు నీయందెలనుక్షణకాలము పాన్పుపైనుంచి తగుమర్యాద గావింపుము.

3) ఓ రాధా! చంద్రునినుండి సరసర జారుచుండు నమృతధారలలాంటి తీయని పలుకులను నీ నోటినుండి రానిమ్ము. నీ స్తనముల వృద్ధికి ప్రతిబంధకమగు విరహము వలెనే, పైకి నుప్పొంగనీక యణచివేయు నీ అవికను విప్పి తొలగింప నిమ్ము.

4) రాధా! ప్రియుని గౌగిలించుటయందత్యుత్సాహముచేత గగుర్పాటును బొందినవియును నన్యుల కతిదుర్లభములగు నీ స్తనకలశములను నా ఱొమ్మున నుంచి నా మన్మథతాపము జల్లార్పుము.

5) నీపై నత్యంత ప్రేమచేత మన్మథాగ్ని నన్ను నిలువున గాల్చివేయుచున్నది. నా ప్రాణములు పోవుచున్నవి. నీ యధరామృతము నొసంగి నన్ను బ్రతికించుము.

6) ఓ పక్షీ! నీ కంఠధ్వనికి తోడుగ రతనాల మొలనూలును గూడ మ్రోగనిమ్ము. అలాచేసి చిరకాలమునుండి కోకిలల నెమిళ్ళ ధ్వనులచే మిగుల వైకల్యము నొందియున్న నా చెవులయొక్క శ్రమమును బోగొట్టుము.

7) ఓ కమల నయనా! నీవు వ్యర్థమగు కోపమును జూపి నన్ను నిష్ప్రయోజకునిగ జేసినందున, నిప్పుడు నన్ను జూచుటకు సిగ్గు పడినవి వోలె [మార్గాయాసముచేత] నీ కనులు మూతలు బడుచున్నవి. ఇక మార్గాయాసమును వదలిపెట్టుము.

8) శ్రీయతి జయదేవులచే వ్రాయబడిన ఈ రసమయగీతము రసికజనులకు సంభోగరసభావ సంబంధమగు వినోదమును గలిగించును గాక.

అవ॥ ఇక సురతారంభమును వర్ణింప మొదలిడుచున్నాడు.

చం॥ పులకలచేత గౌగిలుల, – పొల్పగు ఱెప్పలపాటుచేత దృ
క్కుల, మధురాధరామృతము – గ్రోలుటలో రసవత్కథాళిచే,
నలరును నొంద మైథునము– లందు, గనంబడి రంతరాయవై
రులు దగ, రాధికామధు వి–రోధుల మన్మథకేళి
వేళలన్॥ 68

తా॥ అంత రాధాకృష్ణు లత్యంతానందరస నిమగ్నులై యన్యోన్యానురాగ మతిశయింప సురతారంభమునకు గడంగిరి. అప్పుడు వారుభయులు బిగికౌగిలింతల ననుభవించునప్పుడు గగుర్పాటులును సాభిప్రాయ ముగ క్రీడావిషయమై పరస్పరము జూచుకొనునప్పుడు ఱెప్పపాటు లును, నధరామృతము గ్రోలునపుడు రసవత్కథలను జెప్పుటయు, మన్మథ బంధభేదములచే గ్రీడించునపుడు, నానందావిర్భావములును మొదలగు నాటంకములను శత్రువులు సాక్షాత్కరించిరి– అనగా శృంగారరసము బ్రతిఫలించునట్లు సాంగముగా గ్రీడించిరనుట –

అవ॥ ఆ సంభోగశృంగారమే మరల విచిత్రరీతిలో వివరింపబడుచున్నది.

ఉ॥ పాణి నిబంధితుండునయి, – భారపయోధర పీడితుండునై,
పాణిజ గుంఫితుండునయి, – బాహు విమర్దిత పృష్ఠభాగుడై.
శోణిత దంతవాస మధు – శోషితుడై, మది తృప్తిజెందె, ని
ర్వాణ ధవుండహో! విషమ – బాణుని లీల
మహా విచిత్రమౌ॥ 69

